శ్రీమతే

రామానుజాయ నమః.

# ముముక్షుప్పడి ఆంధ్రము.

పిళ్లైలోకాచార్యులవారు సాయించిన

ముముక్షుప్పడి అను గ్రంథమును

శ్రీ. ఉ. ప్రవర్తకులయిన

కందాడై శ్రీనివాసాచార్యులగారివల్ల విని

గంజాంజిల్లా బరంపురం నివాసులగు

శ్రీన్యాయపతి రామదాసు పంతులుగారిచే

ప్రకటింపబడియె.

సద్విజయతే తరామ్.

ఆళ్వార్ తిరువవతారాది.

౪౯౯౪ వైశాఖ మాసము



*Printed by G. V. Jagannadhacharier Arsha Press, Vizagapatam.* 1892.

## పీఠిక.

శ్రీమతే రామానుజాయ నమః।

శ్రియఃపతియొక్క పాదారవిందములను చేరుటెట్లాగదా అని చింతాక్రాంతులగు జనులకత్యంతోపకారముగ పిళ్లైలోకాచార్యులవారు పదునెనిమిది రహస్యగ్రంథములను ద్రావిడభాషలో వ్రాయించియున్నారన్న సంగతి అందరకు తెలిసినదేయున్నది. వాటిలో ముముక్షుప్పడి అనునది అట్టి చింతాక్రాంతులకవశ్యము అనుసంధింపవలసినదైయున్నది. అయితే అది ద్రావిడభాషయందుండుటచే మన తెలుగు దేశములో దానిని తెలిసికొననభిలాషగలవారికి సులభముగాలేదు. కాబట్టి ఆగ్రంథమును తెలుగున వ్రాసినట్లయిన కొందరు సంతోషింతురని యీ తెలుగు గ్రంథము ప్రచురపరుచుటయయినది. అయితే దీనిని ముఖ్యముగా స్త్రీలు బాలురు అనుసంధించుటకు తగినట్లుండవలెనను నుద్దేశముతో సులభమైన తెలుగుమాటలతో వ్యాఖ్యానాంశములలో కొన్నింటిని చేర్చి వ్రాయుటయయినది. ద్రవిడగ్రంథముయొక్క అర్థమునేనొకరీతిగా మాశక్తికొలది తెలుపుదుచేయుటయందే తాత్పర్యముగాని వేరేమియులేదు- దీనియందుండు తప్పులను సత్పురుషులును పండితులును మన్నించి సవరించుకొనగలందులకు ప్రార్థించుచున్నాము-

శ్రీమతే రామానుజాయ నమః-

తిరుమన్త్రార్థము-

ముముక్షుప్పడి- అనగా మోక్షమును కోరిన

వారికి తెలియవలసినది-

౧- మోక్షమందిచ్చగలవానికి తెలియవలసిన రహస్యము లు మూడు- రహస్యమనగా నేకాంతముగా తెలిసికొనవలసిన ది; అనగా ఉపదేశముచేత తెలియదగినది.

౨. అందు ప్రథమ రహస్యము తిరుమన్త్రము; అనగా నారాయణాష్టాక్షర- మన్త్రమనగా తన్ను అనుసంధించువారలను రక్షించునది.

౩- తిరుమన్త్రముయొక్క గౌరవమునకు దగునట్లు భక్తితో నాదరించిఅనుసంధించవలయును- అనుసంధానమనగా మననము-

౪- మంత్రమందును మంత్రమందు జెప్పబడు దైవమందును మంత్రము నుపదేశించిన ఆచార్యుని యందును భక్తిమిగుల నుండెనేని కార్యకరమగును- ఆచార్యుడనగా మంత్రమందుగల అర్థమును తానాచరించి శిష్యునిచేత నాచరింప జేయువాడు-

౫- సంసారులు స్వస్వరూపమును భగవంతుని యొక్క స్వరూపమును నెరది అనగా తెలిసికొనక ఈశ్వర కైంకర్యమును కుచెడి, చెడితిమను విచారమయినను లేక సంసారమనెడు పెద్ద సముద్రమందు బడి దరిగానక బాధను జెందుచుండగా భగవంతుడు తన నిర్హేతుక కృపచేతను ఈసంసారులు తన్ను తెలిసికొని దరిని జేరునట్లు నరనారాయణరూపముగా శ్రీబదరికాశ్రమమందు తానే శిష్యుడును తానే ఆచార్యుడునై యుండి ఈనారాయణాష్టాక్షరి యను మన్త్రమును వెల్లడి పరచెను-

౬- శిష్యుడుండవలసిన క్రమము లోకులకు దెలియక పోవుట చేత దానిని దెలియజేయుటకై భగవంతుడు నరుడను పేరుతో శిష్యుడయి యుండెను-

౭- సకల శాస్త్రములను చదివి సంపాదించెడు జ్ఞానము

స్వార్జిత ధనమువంటిది- తిరుమంత్రమును చదివి సంపాదించు జ్ఞానము పితార్జిత ధనమువంటిది-

౮. ఈ నారాయణాష్టాక్షరి యనెడు తిరుమంత్రమేగాక వాసుదేవ ద్వాదశాక్షరి విష్ణుషడక్షరి మొదలుగాగల మంత్రములనేకములు గలవు-

౯- ఈ మన్త్రములు వ్యాపక మన్త్రములనియు అవ్యాపకమన్త్రములనియు రెండు విధములు- వ్యాపక మన్త్రము లనగా భగవంతుని యొక్క సర్వవ్యాపకత్వమును చెప్పునవి- అవ్యాపక మన్త్రము లనగా భగవంతుని యొక్క సర్వవ్యాపకత్వమును చెప్పక ఆయన యొక్క అవతార గుణచేష్టితములలో నొకానొకదాని మాత్రమే చెప్పునవి-

౧౦. అవ్యాపకము లయిన తక్కిన మన్త్రములకంటె వ్యాపక మన్త్రములగు నారాయణ వాసుదేవ విష్ణు మన్త్రములు మూడును శ్రేష్ఠములు-

౧౧- ఈ మూడింటిలోను పెరియ తిరుమన్త్రమని వాడుక చేయబడు నారాయణాష్టాక్షరీ మన్త్రము ప్రధానమైనది-

౧౨. మిగిలిన వాసుదేవ విష్ణు మన్త్రములు రెండింటిని ఇతర మతస్థులు అవలంబించుటయు అర్థపూర్తి లేకపోవుటయు కలవు-

౧౩- నారాయణాష్టాక్షరిని అపౌరుషేయములైన వేదములును పరాశరాది ఋషులును నమ్మాళ్వారు మొదలయిన ఆళ్వారులును నాథమునులు మొదలయిన పూర్వాచార్యులును ఆదరించిరి-

౧౪- మన్త్రమునకు అర్థభూతుడై యున్న భగవంతుని వైభవముకంటె ఈ మన్త్రవైభవము అధికమైయున్నది.

౧౫ ఈశ్వరుడు అదృశ్యుడయినను మన్త్రము దృశ్యమైయుండి ఉపకరించును.

౧౬ భీష్ములు మొదలయిన వారి సభయందు దుశ్శాసనుని చేత మానభంగమును జెందిన ద్రౌపదికి చీరలను వృద్ధి పొందించి మానమును కాపాడి రక్షించిన మన్త్రము ఇదియేగదా.

౧౭- ఈమన్త్రము భక్తి మొదలగు గౌరవముతో అనుసంధించక అగౌరవముతో అనుసంధించినను తానివ్వ వలసినఫలమునకు లోపము చేయదు.

౧౮- ఈమన్త్రము కులము మొదలయిన సకలాపేక్షితముల నిచ్చును-

౧౯. ఐశ్వర్యము కైవల్యము భగవల్లాభము మొదలయినవాటిని అపేక్షించువారికి వాటి నిచ్చును — ఐశ్వర్యమనగా ఇహలోకమందును స్వర్గాదులందును అనుభవించు సంపద — కైవల్య మనగా పరమపదమునకు సంబంధించియున్న ఒక స్థానమందుండి చేయు కేవలాత్మానుభవము — భగవల్లాభమనగా ముక్తుడై పరమపదమందు శుద్ధసత్త్వదేహముతో చేయుపరమ పురుషార్థమయిన భగవత్కైంకర్యము.

౨౦- భగవత్ప్రాప్తి సాధనము లగు కర్మయోగ జ్ఞానయోగ భక్తియోగములను అవలంబించువారికి తత్సిద్ధ్యర్థమై ఈమన్త్రము సహాయముగా కోరినయెడల వాటికి ఉండు ప్రతిబంధకములను పోగొట్టి వాటిని సిద్ధింపజేయును.

కర్మయోగ మనగా యజ్ఞ దాన తపో ధ్యాన సంధ్యావందన పంచమహాయజ్ఞ అగ్నిహోత్ర తీర్థయాత్రా పుణ్యక్షేత్రవాస కృచ్ఛ్ర చాంద్రాయణ పుణ్యనదీస్నాన వ్రత చాతుర్మాస్య ఫల మూలాశన శాస్త్రాభ్యాస సమారాధన జపతర్పణాదులచేతకలుగు దేహశోషణము వలన పాపము నశించి అందువలన ఇంద్రియద్వారా ప్రసరించు జ్ఞానమునకు క్షుద్రవిషయములు గోచరములు కాకపోవుటచేత సద్విషయమందు అభిలాషగలిగి యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధిరూపమయిన అష్టాంగయోగ క్రమముచేత యోగాభ్యాస కాలము వరకు జ్ఞానమున కాత్మను లక్ష్యముగా జేయుట.

జ్ఞానయోగ మనగా కర్మయోగము వలన పుట్టిన జ్ఞానమునకు హృదయ కమలము ఆదిత్యమణ్డలము మొదలగు స్థలముల

యందు వేంచేసియుండు సర్వేశ్వరుని లక్ష్యముచేసి ఆయనను శఙ్ఖచక్రాదులతో కూడియున్న వానినిగాను పీతాంబరధరునిగాను కిరీటము మొదలగు సర్వాభరణ భూషితునిగాను లక్ష్మితో గూడియున్న వానిగాను అనుభవించి యోగాభ్యాసక్రమముచేత అనుభవకాలమును వృద్ధిపొందించుచు యెడతెగని ధ్యానమును జేయుట.

భక్తియోగమనగా జ్ఞానయోగము వలనకలిగిన తైలధారవలె యెడతెగని స్మృతి సంతాన రూపమయిన అనుభవమును ప్రీతిరూపముగా జేయుట.

౨౧- ఈమన్త్రము ప్రపత్తిలో జిగిన వారికి భగవత్స్వాతంత్ర్యసువేషు స్వరూప జ్ఞానమును విశదముగ బుట్టించి కాలక్షేపమునకును భోగమునకును హేతువైయుండును.

ప్రపత్తి అనగా కర్మజ్ఞానభక్తులు స్వతంత్రోపాయములగుటచేత కేవల భగవత్పరతంత్రమైన ఆత్మస్వరూపమునకు విరుద్ధములని వాటిని చేయుటకసమర్థుడై భగవత్సన్నిధియందు జేయు భరసమర్పణము.

భరసమర్పణమనగా తన రక్షణభారము తనకు లేదనే జ్ఞానముతో ఈశ్వరునియందు ఆభారమును సమర్పించి నమ్మియుండుట.

ఈ ప్రపత్తి ఆర్తప్రపత్తి అనియు దృప్తప్రపత్తి అనియు రెండు విధములు.

ఆర్తప్రపత్తి అనగా భగవన్నిర్హేతుక కృపచే జ్ఞానము పుట్టగానే భగవదనుభవమునకు ప్రతిబంధకములయిన ఈదేహమును ఈదేశమును ఈదేశస్థుల యొక్క సహవాసమును సహింపజాలక భగవదనుభవమునకు సహకారమైన ముక్తదేహమును ముక్తిస్థానమును ముక్తపురుషుల సాన్నిధ్యమును పొందుటకై త్వరపడి ఆర్తితో జేయు ప్రపత్తి. ఆర్తప్రపన్నులకు వెంటనే ముక్తి కలుగును. ఇట్టి ఆర్తప్రపన్నులు ఆళ్వారాదులు. (నమ్మాళ్వారు మొదలగు ౧౧రు)

దృప్తప్రపత్తి అనగా ఇట్టి ఆర్తిమాత్రము లేక తనరక్షణభా

రమును భగవంతునియందు సమర్పించి నమ్మి ఆయనయొక్క ఆ
జ్ఞా కైంకర్యమును చేయుచుండుట- ఇట్టి దృప్త ప్రపన్నులకు దే
హావసానమందు మోక్షముగలుగును- (వీరు నాథ మునులు మొద
లగుపూర్వాచార్యులు-)

కాలక్షేప మనగా ఈ తిరుమన్త్రమందు చెప్పబడిన అర్థా
నుసంధానాదులచేత కాలమును వెళ్ల బుచ్చుచుండుట-

౨౨. ఆత్మోజ్జీవనమునకు సాధనముగా తెలియవలసిన అర్థ
విశేషములన్నియు ఈమన్త్రమందే ఉన్నవి-

౨౩. అవి అయిదర్థములు- అవి యేవనగా (౧) స్వ
స్వరూపము (౨) పరస్వరూపము (౩) పురుషార్థ స్వరూపము
(౪)ఉపాయ స్వరూపము (౫) విరోధిస్వరూపము-

(౧) స్వస్వరూప మనగా జీవస్వరూపము- యీజీవస్వరూప
ము అయిదు విధములు. ౧నిత్యులు, ౨ముక్తులు, ౩బద్ధులు,
౪ కేవలులు, ౫ ముముక్షువులు.

౧. నిత్యులనగా సంసార సంబంధము లేక నిత్య విభూతి
యందు భగవంతుని సన్నిధిని నిత్య కైంకర్యమును చేయుచునుం
డు అనంత గరుడ విష్వక్సేనాదులు-

౨. ముక్తులనగా- భగవత్కృపచేత సంసారసంబంధము
నువదలి నిత్యవిభూతిని పొంది నిత్యులవలెనేపునరావృత్తి లేకుం
డా నిత్య కైంకర్యమును చేయుచుండువారు-

౩. బద్ధులనగా- సంసారమందుండి దేహాత్మాభిమానము
కలవారై క్షుద్ర భోగములనే పురుషార్థముగా దలంచుచు
ఆత్మజ్ఞానము గానీ భగవజ్జ్ఞానము గానీ లేక అహంకార
మమకారములలో మునిగి దారపుత్రాదులయందు మోహము
కలిగియుండు వారు.

౪. కేవలులనగా- సంసారమను దావాగ్నిచేత తప్తులై ఆ
తాప నివృత్తికి సాధనముగా శాస్త్రాభ్యాసము చేసి అందు
వల్ల ప్రకృతికంటె ఆత్మ విలక్షణమయినదనియు, ప్రకృతిదుఃఖా

స్వతన్త్రమైనదనియు, తెలిసికొని అట్టి ప్రకృతి సంబంధ నివృత్తి కొరకు భగవంతుని ధ్యానము చేసి ఆత్మానుభవ రూపమయిన కైవల్యమోక్షమును సంపాదించుకొని అనుభవించువారు-

౪. ముముక్షువులనగా- భగవదనుభవార్థమై దానికివిరోధియైన సంసార నివృత్తిని ప్రార్థించి భక్తి ప్రపత్తి మొదలగు భగవత్ప్రాప్తిసాధనములను అవలంబించి యుండువారు-

(౨) పరస్వరూపమనగా ఈశ్వరస్వరూపము. ఇదిఅయిదువిధములు- అవి యేవనగా- ౧-పర ౨. వ్యూహ ౩.విభవ ౪ అంతర్యామి ౫-అర్చలు-

౧. పరమనగా శుద్ధ సత్త్వమయమై త్రిపాద్విభూతి యను పేరుగల నిత్యవిభూతియందు నిత్య సూరి సేవ్యమై యుండు పరవాసుదేవ మూర్తి-

౨. వ్యూహమనగా వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధ వ్యూహములయందు ఆయా నామములతో జగత్సృష్ట్యాదులను చేయుచుండు భగవత్స్వరూపములు.

౩- విభవములనగా రామకృష్ణనృసింహాది అనంతావతారములు- ఈఅవతారములు రెండు విధములు- ముఖ్యావతారములు గౌణావతారములు అని-

ముఖ్యావతారము లనగా- జీవసంబంధములేక జగద్రక్షణార్థమై "రామ కృష్ణ నృసింహాశ్చ పూర్ణా షాడ్గుణ్య మూర్తయః" అనుప్రకారముగా షడ్గుణములతో పూర్ణుడైనసర్వేశ్వరుడు సాక్షాదవతరించిన రామకృష్ణాద్యవతారములు-

గౌణావతారము లనగా జీవులయందు ఆయా పనులకొరకై భగవదంశము ఆవేశించిన అవతారములు- ఇవి వ్యాసదత్తాత్రేయాద్యవతారములు- వీరిని ముముక్షువులు మోక్షసాధనముగా ఉపాసింప బనిలేదు-

౪- అంతర్యామిఅనగా సమస్త వస్తువుల యందు వ్యాపించి యుండు భగవత్స్వరూపము. ఈవ్యాప్తి రెండు విధములు-

(౧) స్వరూపవ్యాప్తి (౨)విగ్రహవ్యాప్తి-

(౧) స్వరూపవ్యాప్తి అనగా సర్వభూతములయందును సూక్ష్మరూపుడై భగవంతుడు వ్యాపించి యుండుట-

(౨) విగ్రహ వ్యాప్తి అనగా భక్తులయందలి అనుగ్రహము చేత వారిహృదయ కమల ములలో అంగుష్ఠ మాత్ర ప్రమాణముగా లక్ష్మీసహితుడై వేంచేసియుండుట-

౫. అర్చావతార మనగా భక్తుల యొక్క ఇచ్ఛానుసారముగా ఆయా నామ రూప ములను పరిగ్రహించి దర్శన మిచ్చెడి బహువిధములైన విగ్రహములు- ఇవి నాల్గువిధములు- (౧)స్వయంవ్యక్తములు; (౨)దివ్యములు; (౩)సైద్ధములు;(౪) మానుషములు-

(౧)స్వయం వ్యక్తములనగా నరసింహాద్యవతారములవలెనే భగవంతుడు స్వయముగా ఆవిష్కరించినవి-

(౨) దివ్యములనగా దేవతలచేత ప్రతిష్ఠితములయినవి.

(౩) సైద్ధము లనగా సిద్ధులచేత ప్రతిష్ఠితములయినవి-

(౪) మానుషములనగా మనుష్యులచేత ప్రతిష్ఠితములయినవి-

(౩) పురుషార్థ స్వరూప మనగా పురుషుని చేత గోరబడునది- అవి అయిదువిధములు:- ౧ ధర్మము, ౨ అర్థము, ౩ కామము- ౪ ఆత్మానుభవము. ౫ భగవదనుభవము-

౧. ధర్మమనగా ప్రాణిరక్షణమున కుపయోగముగా జేయు పనులు-

౨- అర్థమనగా వర్ణాశ్రమములకు ఉచితముగాధనధాన్యాదులను సంపాదించి దేవతావిషయములయందును పైతృకకర్మలవిషయమందును ప్రాణులవిషయమందును దేశకాల పాత్రముల నెరిగి ధర్మబుద్ధితో ఖర్చుపెట్టునది-

౩- కామమనగా (౧)ఇహ (౨)పర లోకముల యందు అనుభవించు సుఖవిశేషము-

(౧) ఇహలోక సుఖమనగా తల్లి తండ్రి భార్య రత్నములు ధనము ధాన్యము వస్త్రములు అన్న పానములు పుత్రులు మిత్రులు పశువులు గృహములు క్షేత్రములు చందనము పుష్పములు తాంబూలము మొదలగు వాని అనుభవము వల్ల గల్గు సుఖము.

(౨) పరలోకసుఖ మనగా ఈ లోకము కన్న విలక్షణమైన స్వర్గాది లోకములకు వెళ్లి ఆకలి దాహము శోకము ముసలితనము మరణము మొదలగునవి లేక సంపాదించిన పుణ్యమునకు తగినట్లు అమృత పానము చేసి రంభాది అప్సరసలతో సుఖించుట-

౩- ఆత్మానుభవ మనగా దుఃఖనివృత్తి మాత్రమైన కేవలాత్మానుభవము-

౪- భగవదనుభవ మనగా జీవుడు చేసిన భక్తిప్రపత్తుల వల్ల పుణ్య పాపములను నశింప జేసి మూర్ధన్య నాడి ద్వారా ఈ శరీరమును విడిచి అర్చిరాది మార్గమున పరమపదమునకు వెళ్లి శుద్ధ సత్త్వ దేహమును పొంది లక్ష్మీ భూమి నీళా నాయకుడగు శ్రీమన్నారాయణుని నిత్యసేవ చేయుచు నుండుట-

(౪) ఉపాయస్వరూప మనగా భగవత్ప్రాప్తిని కలుగజేయు సాధనస్వరూపము; ఇది అయిదు విధములు- ౧ కర్మము, ౨ జ్ఞానము, ౩ భక్తి, ౪ ప్రపత్తి, ౫ ఆచార్యాభిమానము-

ఇందులో కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తులయొక్క వివరణము ౨౧- ౨౨- సంఖ్య గల వాక్యములలో చేయబడినది-

౫ ఆచార్యాభిమాన మనగా చేతనుడు కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తుల యందు అశక్తుడై యుండునపుడు వీనియందు కనికరించి వీనిలాభమునకై భగవత్సన్నిధిని ప్రపత్తి చేసి వీనినుజ్జీవింప జేయు జ్ఞానానుష్ఠాన సంపన్నులగు ఆచార్యుల అభిమానమునకు పాత్రుడై యుండుట- ఇది రెండు విధములు:-

(౧) స్వగత స్వీకారము, (౨) పరగత స్వీకారము-

(౧) స్వగతస్వీకారమనగా చేతనుడు ఆశ్రయించిన పైని ఆచార్యుడు అభిమానించి స్వీకరించుట-

(౨) పరగత స్వీకార మనగా తాను ఆశ్రయించక పోయినను ఆచార్యుడు అభిమానించి స్వీకరించుట-

(౫) విరోధి స్వరూపమనగా చేతనుడు అపేక్షించు లాభమునకు విరోధించునది. ఇది ౫ విధములు:- ౧ స్వరూప విరోధి- ౨ పరస్వరూపవిరోధి- ౩ పురుషార్థ విరోధి ౪ ఉపాయ విరోధి- ౫- ప్రాప్తి విరోధి-

(౧) స్వరూప విరోధి అనగా దేహమే ఆత్మ యను భ్రమయును భగవదితరులకు శేషభూతుడ నను భ్రమయును స్వస్వాతంత్ర్యమును-

(౨) పరస్వరూప విరోధి యనగా దేవతాంతరములయందు పరత్వబుద్ధియును, దేవతాంతరములయందు భగవంతునితో సమానబుద్ధియును, క్షుద్ర దేవతాదులయందు మహత్త్వబుద్ధియును, భగవదవతారములయందు మానుష ప్రతిపత్తియును, అర్చావతారమందు అశక్తి ప్రతిపత్తియును-

(౩) పురుషార్థ విరోధి యనగా భగవత్కైంకర్యరూప ఫలముకంటె ఇతరమైన ఐశ్వర్యము మొదలగు ఫలములను కోరుటయును, భగవంతుని యొక్క ఇష్టానిష్టములను విచారింపక తన కిష్టము వచ్చిన కైంకర్యమును చేయుటయును-

(౪) ఉపాయవిరోధియనగా ప్రపత్తి కంటె అన్యములైన భగవత్ప్రాప్త్యుపాయములయందు వైలక్షణ్య ప్రతిపత్తియును అనగా ఆధిక్య బుద్ధియును, ప్రపత్త్యుపాయము సులభముగా చేయదగినది కాబట్టిన్ని దీని చేత పొందవలసిన ఫలము గొప్పది కాబట్టిన్ని ఈ ఫలము పొందుటకు విరోధులైన మనము చేసుకొన్న పాపములు అధికములు కాబట్టిన్ని ఈ ప్రపత్తి వల్ల ఇంత ఫలము కలుగునో లేదో అను సంశయమున్ను-

(౫) ప్రాప్తి విరోధి యనగా భగవంతుని విషయమయ్యె

న భాగవతుల విషయమయ్యును ఆచార్యుల విషయమయ్యును వారికి శిష్యులయి తనతో సబ్రహ్మచారులగు వారి విషయమయ్యును చేయు నపచారములు.

౨౮. పూర్వాచార్యులవారు ఈమన్త్రమంతటి అర్థమును తెలియుటకు మునుపు తాము పుట్టినవారుగా తలచి యుండిరి. దీనియందైన అర్థజ్ఞానము కలిగిన వెనుక ఈమన్త్రార్థముతో వినాగా మఱియొకదానితో కాలమును వెళ్లించియెఱుగరు.

౨౯. ఈమన్త్రము అర్థమక్కర లేకుండా తన్ను ఉచ్చరించినవారలను చేతనే సమస్త ఫలముల నిచ్చునదిగా యుండగా ఈ మన్త్రమంతయుకంటె అర్థమందె పూర్వాచార్యులు అనుసక్తి కలిగి యుండుటకు హేతు వేమనగా ఏమికోరు ఫలము భగవంతుడగుట చేతను ఆ ఫలము నిచ్చువాడు భగవంతుడగుట చేతను ఈమన్త్రార్థము భగవదేకోపాయత్వమే అగుట చేతను అర్థమందే ఆసక్తి కలవారై యుండిరి.

౩౦. ఈమన్త్రమందు చెప్పబడుచున్న అర్థము:- ఓమ్ అను ప్రణవముచేత జీవుని యొక్క శేషత్వమున్ను, నమః అను పదముచేత జీవుని యొక్క పారతన్త్ర్యమున్ను- ఈ రెండు పదములు కలిసి జీవుని యొక్క శేషత్వ పారతన్త్ర్య స్వరూపములను చెప్పుచున్నవి—నారాయణాయ అనుపదముచేత ఈ జీవుడు భగవంతుని విషయమై చేయవలసిన కైంకర్యరూపమయిన ఫలము చెప్పబడుచున్నది—ప్రణవము చేత జీవుని శేషత్వమున్ను, నమః పదము చేత భగవదేకోపాయత్వమున్ను నారాయణపదము చేత కైంకర్యమున్ను చెప్పబడుచున్నవి.

౩౧. జీవుడు పొందవలసిన ఫలము యొక్క వివరము, ప్రమేయశేఖర మను గ్రంథములోనున్న అర్చిరాది యను గ్రంథములోనున్ను చెప్పబడియున్నది— ఈ ఆత్మ అర్చిరాది మార్గముగా పరమపదమునకు బోయి పరిపూర్ణ భగవదనుభవమును చేసి అందువల్ల కలిగిన ప్రీతిచేత ప్రేరణచేయబడినవాడై భగవంతుని విషయ

మై చేయుసర్వవిధకైంకర్యములే ఫలముగా ఈ గ్రంథములయం దు చెప్పబడుచున్నవి-

౨౮. ఈమన్త్రము ఎనిమిది అక్షరములు కలదై, మూడుప దములు కలదై యుండును—ఓమ్అనునది యొక అక్షరము- న మః అనునది రెండు అక్షరములు- నారాయణాయ అనునది అయి దు అక్షరములు- —ఈమన్త్రమును నారాయణోపనిషత్తు అ ష్టాక్షరిగా చెప్పుచున్నది-

౨౯- ఈమూడుపదములునుమూడుఅర్థములనుచెప్పుచున్నవి. అవి యేవి అనగా శేషత్వమున్ను పారతంత్ర్యమున్ను కైంకర్య మున్ను-

౩౦- ఇందులో మొదటిపదము ప్రణవము-

౩౧- ఇది అకార ఉకార మకారములతో కలిసి ఓమ్ అని ప లుకబడుచున్నది-

౩౨- బ్రహ్మ వేదాధ్యయనము చేయు సమయమందు ఋ గ్వేదమువలన భూః అను వ్యాహృతియును యజుర్వేదము వలన భువః అను వ్యాహృతియును సామవేదమువలన సువః అను వ్యాహృ తియును వినబడెను- ఈమూడువ్యాహృతులను తరిచి చూడగా వీ టిలోనుండి అకార ఉకార మకారములను మూడు అక్షరములు క్ర మముగా పుట్టినవి-

౩౩- కాబట్టి యీప్రణవము సకలవేదసారమని చెప్పబడును-

౩౪- ఇందు అకారము సకలశబ్దములకును కారణమై నారా యణపదమునకు సంగ్రహమై యుండుటచేత సకలజగత్తులకును కారణమై సర్వరక్షకుడయి యున్న యీశ్వరుని చెప్పుచున్నది-

అకారము సమస్త శబ్దములకు కారణ మగుట వల్లను ఈశ్వ రుడు సమస్త వస్తువులకు కారణ మగుటవల్లను అకారము భగవం తుని యొక్క సర్వకారణత్వమును చెప్పుచున్నది- (అవ రక్షణే) అనుధాతువువల్ల కలిగి నందున భగవంతుని యొక్క సర్వ రక్షక త్వమును చెప్పుచున్నది.

౩౫- రక్షించుట యనగా విరోధిని పోగొట్టుటయును అపే
క్షితములను ఇచ్చుటయును.

౩౬- ఈ రెండును చేతనుల అధికారానుసారముగా అనగా స్థి
తికి తగినట్లు ఉండును.

౩౭- సంసారులకు విరోధి శత్రు పీడాదులు అనగా తాపత్ర
యమువల్ల కలుగు పీడలు.

తాపత్రయ మనగా (౧)ఆధ్యాత్మికము (౨) ఆధిదైవికము(౩
ఆధిభౌతికము.

(౧) ఆధ్యాత్మికము రెండువిధములు ౧ శారీరము ౨మానసము.

౧ శారీరమనగా శరీరమునకు సంభవించు బహు విధము
లైన వ్యాధులు.

౨ మానస మనగా కామము క్రోధము భయము ద్వేష
ము లోభము మోహము విషాదము శోకము అసూయ అవ
మానము ఈర్ష్య మాత్సర్యము మొదలగు మనో రోగములు
(ఆధులు)

(౨) ఆధిదైవిక మనగా చలి గాలి ఎండ వర్షము పిడు
గులు మొదలగు వాటివల్ల పుట్టుతాపము.

(౩) ఆధిభౌతికము అనగా పశువులు పక్షులు మనుష్యులుపిశా
చములు సర్పములు రాక్షసులు క్షుద్రసర్పములు మొదలగువాటి
వల్ల కలుగు తాపము అనగా పీడ.

సంసారులకు అపేక్షితము అన్నపానాదులు. అదికష్టము చే
త పుష్పమాలికలు వస్త్రములు ఆభరణములు చందనము అంగనా
లింగనము మొదలగునవి చెప్పబడుచున్నవి.

ముముక్షువులకు విరోధి సంసార సంబంధము అనగా అసత్య
జ్ఞానము దుష్టవ్యాపారము మలినదేహము కలవారై యీవిభూ
తియందుండుట—అపేక్షితము, భగవదనుభవమునకు అనుకూల
మైన పరమ పదముపొందుట.

విరక్తులకును ముక్తులకును విరోధి భగవత్సన్నిధిని చేయు కై

కర్యమునకు వచ్చు విచ్ఛేదము — అపేక్షితము ఉత్తరోత్తరార్త్రం కర్యవృద్ధి.

౩౮. ఈశ్వరుని కంటెను మిగిలినవారు రక్షకులు కారను అంశము ప్రపన్నపరిత్రాణములో హేతువులతో విస్తరించి చెప్పబడినది.

౩౯. రక్షించునప్పుడు పురుషకార భూతురాలను పిరాట్టి సన్నిధి కావలసి యుండుటచేతను ఈ అకారమందు శ్రీసంబంధము అనుసంధింపవలయును.

౪౦. శ్రీః అను శబ్దమునకు భగవంతునినిత్యము విడువకుండా ఆశ్రయించి యుండు ననియు చేతనులచేతనునిత్యము సేవింపబడుచుండు ననియు అర్థము.

౪౧. భగవంతుని వక్షస్థ్సలమందు నిత్యమునసియించియుండునట్టి ఈపిరాట్టి ఆవక్షస్థ్సలమును విడిపి పోగా ఆయనను చెప్పుచున్న ఈఅకారమును విడుచును, అని జ్ఞానాత్మకులయిన సేనాపతి జియ్యరువారు సాయించిరి.

౪౨. పతివ్రతయగుస్త్రీ తనపాతివ్రత్యధర్మమునకు తగినట్టుగా తనపెనిమిటిని సంతోషపెట్టుటకు ఆయనయొక్క పడకను న్నుతనరక్షకత్వధర్మమునకు తగినట్టుగా తనసంతానమునకు స్తన్య మిచ్చుట మొదలయిన యుపచారములు చేసి కాపాడుటకు వారితో గ్గ నున్ను విడవకుండాఉన్నట్లు ఈపిరాట్టియును తన భర్తఅయిన సర్వేశ్వరుని చెప్పుచున్న అకారమును తనసంతానమ్మైన జీవులను చెప్పుమకారమును విడువకుండా ఉండును.

౪౩. యశోదాదేవి పెనిమిటి అయిన నందునిన్ని కుమారుడగు శ్రీకృష్ణునిన్ని విడువక వారలమధ్యను ఈపిరాట్టి గలెనే యుండేది.

౪౪. ఈఅకారమందు శబ్దమునుపట్టి ఒకర్ఈశ్వరశేషత్వము నే చెప్పినను లక్ష్మీశేషత్వము కూడా లోకసిద్ధమై తప్పక వచ్చును. ఎట్లనగా ఒకనొకరు ఒకయజమానుని వద్ద నౌకరీయుండుటకు నిర్ణయించుకొని దస్తావేజు వ్రాసియిచ్చినపుడు అతని

ఆజ్ఞానుసారముగా పనిచేతునని వ్రాసియిచ్చియుండినను ఆయన భార్యయొక్క ఆజ్ఞానుసారముగా నౌకరిచేయదా.

౪౫- కాబట్టి సర్వేశ్వరుని పిరాట్టి విడిచియుండదు.

౪౬- ఇందుకు దృష్టాంతములు సూర్యుని తేజస్సు విడిచియుండనట్లును పుష్పమును పరిమళము విడిచి యుండనట్లును స్వామిని పిరాట్టి విడిచియుండదు.

౪౭- కాబట్టి లక్ష్మితో కూడిన స్వామియందే భక్తిచేయవలెను- ఉభయులయందు భక్తి చేయుట చేతనే గదా విభీషణుడు బాగుపడెను-

౪౮- ఈ అకారమందు సంస్కృత వ్యాకరణ సూత్రము చేత చతుర్థీవిభక్తి కినపడకుండ లోపించి ఆచతుర్థ్యర్థమును మాత్రము ఇచ్చును-

౪౯- ప్రతి శబ్దమునకును పదేసి విభక్తులు ఉండగా ఈశబ్దమునకు ఇచ్చుట చతుర్థీ విభక్తి మాత్రము వచ్చుటకు హేతు వేమనగా-

౫౦- నారాయణాయ అను చతుర్థ్యంత మయిన యీ పదమునకు అకారము సంగ్రహమై యుండుటచేత ఈ అకారమునకు కూడ చతుర్థీవిభక్తి కావలెను-

౫౧- ఈ చతుర్థి, "వానికొరకు," అను అర్థమునిచ్చు తాదర్థ్యచతుర్థి అగుటచేతను ఈశ్వరునికి ఈ జీవుడు శేషము అను అర్థమును తెలుపుచున్నది- శేషత్వము అనగా దాసత్వము-

౫౨- శేషత్వము దుఃఖ రూపమయినదిగా కాదా లోకమందు కనపడుచున్నది అంటిరేని-

౫౩- శేషత్వము యావత్తు దుఃఖ రూపమయినది అను నియమము లేదు- చక్రవర్తులు, మహారాజులు, మొదలయిన ప్రభువుల సన్నిధిని, గొప్ప అధికారుల సన్నిధిని, చేయు శేషవృత్తులు ప్రపంచమందు సుఖముగాను గౌరవముగాను ఉండలేదా?

౫౪- ప్రభువిషయములయిన శేషత్వము వారి ఐశ్వర్యాది గుణ

ములనుపట్టి వచ్చినది గనుక సుఖరూపమయినది అని అంటిరేని ఈశ్వరుని యొక్క గతృకత్వమును చెప్పుచున్న అకారమందు రక్షణమునకు కావలసిన కల్యాణగుణములున్ను ఉన్నవిగనుక ఈశ్వర విషయ శేషత్వమున్ను ఆగుణములను పట్టి సుఖతరముగానే ఉండును.

౫౫. ఆత్మకు స్వరూపమున్ను భగవద్దాసత్వ రూపమైన శేషత్వమే. సమస్తమైన ఆత్మలును పరమాత్మకు శేషభూతులని అనేక ప్రమాణములు చెప్పుచున్నవి.

౫౬. ఆత్మలకును పరమాత్మకును జ్ఞానానందామలత్వములు సమానముగానున్నప్పటికిని పరమాత్మకు స్వామిత్వమే ప్రధాన స్వరూపమయినట్లు ఆత్మలకు భగవద్దాసత్వ రూపమయిన శేషత్వమే స్వరూపము కాబట్టి అట్లు శేషత్వము లేనప్పుడు స్వరూపమే లేకపోవును.

౫౭. ఆత్మకు స్వాభావికమైన శేషత్వమును అంగీకరించక తాను స్వతంత్రుడనని తలంపే ఆత్మాపహార మనబడును.

ఇట్టి స్వాతంత్ర్యము పుట్టినవెంబనే ఆత్మ నశించును. అనగా స్వరూపము లేనిదానివలెనే అగును.

౫౮. ఓమ్ అనే ప్రణవమందు ఉకారము ఏవ అను అవధారణార్థమును చెప్పుచున్నది. "తదేవ భూతం, తదుభవ్యమ్" ఇత్యాది శ్రుతులయందు ఏవకారస్థానమందు ఉకారముండు ఆ ఉకారము ఏవకారార్థమునే ఇచ్చును.

౫౯. ఏవకారార్థమును చెప్పుచున్న యీ ఉకారము ఈశ్వరునికే తప్ప ఇతరులకు ఈ ఆత్మ శేషము కాదని అన్యశేషత్వమును తీసివేయుచున్నది.

౬౦. ఉకారము లక్ష్మీవాచకముగా పాంచరాత్ర గ్రంథమందు చెప్పబడుటచేత అకారమందు భగవచ్ఛేషత్వమున్ను ఉకారమందు లక్ష్మీశేషత్వమున్ను కొందరు చెప్పుదురు.

౬౧. లక్ష్మీశేషత్వము చెప్పుటకంటె ఇదివరలో అకారము

లోవచ్చిన లుప్తచతుర్థి వల్ల చెప్పబడిన భగవచ్ఛేషత్వమునకు విరోధియైన అన్యశేషత్వమును తీసివేయుటే ఆవశ్యకమై యున్నది-

౬౨- ఇంద్రాది దేవతలకు భోగ్యమయిన యజ్ఞమందు హోమము చేయు పురోడాశమును కుక్కకు పెట్టినట్లు భగవదేకశేషమగు ఈ ఆత్మను సంసారులకు శేషముగా చేయుట బహునింద్యము-

౬౩- ఇదివరలో చెప్పిన లక్ష్మీశేషత్వముకంటె ప్రధానమై యుండుటయే గాక భగవచ్ఛేషత్వముకంటెను అన్యశేషత్వనివృత్తి ముఖ్యమై యున్నది-

౬౪- యమకింకర సంవాదమును వ్రాయించిన తిరుమళిశై ఆళ్వారులు భాగవతలక్షణమును చెప్పుచు భగవంతుని మరచినను అన్యశేషత్వములేని మనుష్యులయితే చాలునని వ్రాయించినారు-

౬౫- ఈ ఉకారము ఆత్మ తనకు పరులకుకూడ శేషము కాదు. ఒక్క భగవంతునకే శేషభూతుడను అర్థమును తెలుపుచున్నది-

౬౬- కకారము చేత పంచ భూతములు అనగా పృథివి జలము తేజస్సు వాయువు ఆకాశము చెప్పబడెను — చకారము చేత కర్మేంద్రియములు అనగా నోరు చేయి పాదము పాయు ఉపస్థేంద్రియము మొదలైనవి చెప్పబడుచున్నవి — టకారము చేత జ్ఞానేంద్రియములు అనగా ౧ త్వక్కు (స్పర్శమును గ్రహించు చర్మేంద్రియము) ౨ చక్షుస్సు (నేత్రేంద్రియము) ౩ శ్రోత్రము (చెవి) ౪ జిహ్వ (నాలుక) ౫ ఘ్రాణము (ముక్కు) అను అయిదును చెప్పబడుచున్నవి — తకారము చేత పంచ తన్మాత్రములు అనగా ౧ గంధము ౨ రసము ౩ రూపము ౪ స్పర్శము ౫ శబ్దము ఈ అయిదును (పృథివ్యాది భూతముల యొక్క పంచగుణములు) చెప్పబడుచున్నవి — పకారము చేత మనస్సు చెప్పబడినది- — ఫకారము చేత అహంకారము చెప్పబడినది- — బకారము చేత మహత్తత్త్వమును భకారము చేత ప్రకృతి తత్త్వమును చెప్పబడుచున్నవి — ఇట్లు ఈ యిరువదినాల్గు అక్షరముల చేతను ఇరువదినాల్గు తత్త్వములు చెప్పబడి ఇరువదియైదవ అక్షరమైన మకారముచేత ఇరువదిఅయిదవ

తత్త్వమయిన జీవుడు చెప్పబడుట చేతనున్ను ఈ మకారము "మన జ్ఞానే" అను ధాతువును పట్టి జ్ఞానమును చెప్పునదిగా నుండుట చేతనున్ను జ్ఞానమే స్వరూపముగాగల జీవుడు చెప్పబడుచున్నాడు.

౬౭. ఈమకారము బద్ధ ముక్త నిత్య రూపముగానున్న సకల జీవసమూహమును జెప్పును.

౬౮. ఏకవచనము జీవసమూహమును ఎట్లు చెప్పునంటే, ధాన్యము మొదలయిన సమూహ వాచకముల యందు ఏకవచనము సమూహమును జెప్పును కాబట్టి యిక్కడ కూడా మకారము జీవసమూహమును చెప్పును. దీనిని జాత్యేకవచనమనివాడుకొందురు.

౬౯. ఈమకారముచేత శేషత్వమే స్వరూపముగా చెప్పబడిన ఆత్మ జ్ఞానానన్దములుకూడా లక్షణముగా కలవాడని చెప్పబడుచున్నాడు. దీనిచేత దేహముకంటె ఆత్మవేరని చెప్పబడుచున్నది.

౭౦. ఆత్మ దేహముకంటె వేరనునంశము తత్త్వశేఖరమను గ్రంథమందు సయుక్తికముగా చెప్పబడియున్నది.

౭౧. పరిమళముండబట్టి పుష్పమున్ను కాంతియుండబట్టి రత్నమున్ను ఏలాగున ఆదరింపబడుచున్నవో ఆలాగుననే శేషత్వము ఉండబట్టి ఆత్మయును ఆదరింపబడుచున్నది. కాబట్టి శేషత్వము లేనప్పుడు కేవలము ఆత్మస్వరూపమువలన ప్రయోజనము లేదు. ఈ శేషత్వముయొక్క ఆవశ్యకతను చూపించుటకయ్యే మకారములో చెప్పబడిన జీవస్వరూపమును తెలియ జేయుటకు ముందుగానే అకారములో లోపించి యున్న చతుర్థీ చేతను శేషత్వము చెప్పబడినది.

౭౨. తిరుక్కణ్ణపురమనే గ్రామమందువేంచేసియున్న స్వామికే శేషభూతుడను ఇంకొకరికి శేషభూతుడనుకానుఅని తిరుమంగైయాళ్వారు పాడిన పాశురప్రకారముగా ఈ ప్రణవము చేత జీవేశ్వరులకు శేషశేషిభావ సంబంధము చెప్పబడినది.

౭౩. పద్మమందు నివసించియుండు లక్ష్మీనాథుడగు స్వామిని ఒకనినే నా జ్ఞానము చూచును అని పొయ్గై యాళ్వారులు సా

యుంచిన శ్రీసూక్త ప్రకారముగా లక్ష్మీ సహితుడైన శ్రియఃపతికే సర్వాత్మలును శేషమై ఉండునను అర్థము ఈ ప్రణవమందు చెప్పబడుచున్నది.

౭౪. అకారముచేత రక్షకుడైన సర్వేశ్వరుడు చెప్పబడుచున్నాడు. మకారముచేత రక్షింపబడు జీవుడు చెప్పబడుచున్నాడు. అకారమందున్న లుప్తచతుర్థి చేత రక్షణకు హేతువయిన జీవేశ్వరులకున్న సంబంధము చెప్పబడుచున్నది. ఉకారముచేత రక్షణఫలము చెప్పబడుచున్నది.

రక్షణమునకు ఫలము అన్యులకు పనికిరాక ఈశ్వరునికే అర్హుడయి యుండుట. దీనినే అనన్యార్హత్వమని చెప్పుదురు.

౭౫. ఇకమీదను ప్రణవార్థము వివరింపబడుచున్నది.

౭౬. ఈ ప్రణవములోనున్న ఉకారము యొక్క అర్థము నమఃపదముచేత బహుళముగా చెప్పబడుచున్నది. మకారము యొక్క అర్థము నారాయణపదమందుండు చతుర్థీవిభక్తిచేత విస్తరింపబడుచున్నది. ఈ మకారము యొక్క అర్థము నారపదముచేతకూడా వివరింపబడునని చెప్పుదురు.

౭౭. ఈ మన్త్రములోనుండు అకారమును ముందుగా వివరించి తరువాత ఉకారమును వివరించవలసి యుండగా అట్లు వివరింపక పోవుటకు హేతు వేమనగా:— అకార వివరణ మయిన నారాయణపదమందు చెప్పబడుచున్న భగవత్కైంకర్యమునకు విరోధులైన అహంకార మమకారములు నశించితేనేగాని ఆ భగవత్కైంకర్యము రుచించదు గనుక నమః పదముచేత ఆ విరోధులను పోగొట్టుటకై ఉకారమును ముందుగా వివరించినారు.

౭౮. నమః అను పదమందు న అనియు మః అనియు రెండు పదములు గలవు.

౭౯. మః అను షష్ఠ్యన్తపదము "నాకు" అనెడి అర్థమును చెప్పి శేషత్వమునకు ప్రతికోటియైన స్వాతంత్ర్యమును చెప్పుచున్నది. న అనుపదము "కాదు" అని నిషేధవాచి యగుటచేతను మ

కారములో చెప్పబడిన స్వాతంత్ర్యమును తీసివేయుచున్నది.

౮౦- న, మః, అను రెండు పదములు కలిసి "ఆత్మ తనకు తాను శేషభూతుడు కాడు, స్వతంత్రుడును కాడు" అను అర్థమును చెప్పుచున్నవి.

౮౧- స్వశేషత్వ అన్యశేషత్వములను రెండింటిని తీసివేయుచున్న ఉకారమునకు వివరణమైన యీనమః పదమందు అన్యశేషత్వమును తీసివేయక స్వశేషత్వమును మాత్రము తీసివేయుటకు హేతు వేమంటే. అన్యశేషత్వమును, ఈశ్వరుడు తన కల్యాణ గుణములను చూపించి నివర్తింపజేయుట కవకాశమున్నది. నాకే నేను శేషమన్నప్పుడు అట్టి అవకాశము లేదు. గనుక అన్యశేషత్వముకంటె స్వశేషత్వము క్రూరమైనది కాబట్టి దానినిమాత్రమే తీసివేయుచున్నది.

౮౨- ఈ నమః పదముచేత ఆత్మ ముక్తిని పొందుటకు కలిగియున్న విరోధులు పోగొట్టబడుచున్నవి.

౮౩- ఆ విరోధులు మూడు.

౮౪- అవియేవనగా (౧) ప్రణవము చెప్పుచున్న శేషత్వ స్వరూపమునకుండు విరోధియును, (౨) ఈ నమః పదము చెప్పుచున్న భగవదేకోపాయత్వ స్వరూపమునకుండు విరోధియును, (౩) నారాయణపదము చెప్పుచున్న ప్రాప్యస్వరూపమునకు ఉండు విరోధియును.

౮౫- ఈ విరోధులు పోవడమనగా ఏమన్నను:-

(౧) స్వరూపవిరోధియనునది నేను, నాది, అనెడు అహంకార మమకారములే అగుటచేత వాటిని విడిచి "నేను నీకు పరతంత్రుడను, నా సంబంధముగల వస్తువులు నీకు పరతన్త్రములు" అని ఆత్మాత్మీయములను భగవత్సన్నిధిని సమర్పించి యుండుటయే స్వరూపవిరోధిపోవుట.

(౨) ఉపాయవిరోధి యనునది తనరక్షణ విషయమై తాను స్వతంత్రించి యుండుటే అగుటచేతను, దానిని విడుచుకొని తనరక్షణ

ఖారమును సర్వేశ్వరుని యందుంచుటయే ఉపాయవిరోధిపోవుట.

(౩) ప్రాప్యవిరోధి యనునది పరమపదమందు ఈశ్వరునికి తాను చేయు కైంకర్యము తన ఇచ్ఛాప్రకారము చేయుట; దానినివిడిచి ఈశ్వరునికె ప్రియ మయిన కైంకర్యము చేయుటయే ప్రాప్య విరోధ పోవుట.

౮౬. నమః అను పదమందు అహంకార మమకారములుండుట చేతను దానితో సంబంధించడము ఆత్మస్వరూపమునకు నాశము. నమః అనుపదము చేత అహంకార మమకారములు తీసివేయబడుచున్నవి గనుక దానితో సంబంధించడము ఆత్మస్వరూపమునకు ఉజ్జీవనము, అనగా, ప్రకాశింపజేయునది.

౮౭. ఈ నమఃఅనుపదము ప్రణవమందు చెప్పబడిన అనన్యార్హశేషత్వస్వరూపమును, తనయందు చెప్పబడిన అనన్యశరణత్వస్వరూపమయిన ఉపాయస్వరూపమును, నారాయణపదమందు చెప్పబడిన అనన్యభోగ్యత్వస్వరూపమయిన ఫలస్వరూపమును, ప్రకాశింపజేయుచున్నది.

అనన్యశరణత్వ మనగా భగవంతుడే రక్షకుడనియు ఇతరులు రక్షకులు కారనియు నమ్మియుండుట.

అనన్యభోగ్యత్వమనగా భగవత్కైంకర్యమే తనకుభోగ్యమనియు ఇతరము భోగ్యముకాదనియు నమ్మియుండుట.

౮౮. ఈ స్వరూప ఉపాయ పురుషార్థములను ప్రకాశింపజేయు విధమేమనగా:—

(౧) ఆళ్వారులు భగవచ్ఛేషత్వమాత్రములో తృప్తి పొందక వానిసంబంధమైన తొలవిల్లిమంగలమనే దివ్యదేశమునకుకూడా తాము శేషమైన ప్రకారమును "తొణ్డ్రుం" అనే నమఃపదమును పాయించుటవల్ల ఈ నమః పదము శేషత్వ స్వరూపమును ప్రకాశింపజేయుచున్నది.

(౨) ఆళ్వారులు "తిరువేంగడముడయానుకు నేను శేషభూతుడను, నాకు కాను, అందువల్లనే నారక్షణోపాయము నాకులేదు,

వాని యందే ఉన్నది" అను అర్థమును నమఃపదమునే సా
ధించుటచేతను ఈపదము ఉపాయమును ప్రకాశింపజేయుచున్నది.

(3) ఆళ్వారులు నిత్యవిభూతియందుచేయు కైంకర్యము యొక్క భోగ్యతాతిశయముచేతను ఒకవిధమైన స్వాతంత్ర్యము పుట్టినందున దానినిపోగొట్టుకొని కైంకర్యమును వృద్ధిపొందించు కొనుటకొరకు కైంకర్యాంతమందు నమఃపదమును సాధించుటచేతను దీనియందు పారార్థ్యము ప్రకాశింపజేయబడుచున్నది.

౮౯. తిరుమంగైయాళ్వారులు ఈ తిరుమంత్రమందు సకలార్థములుఉన్నట్లు ఒప్పుకొనుచు భగవత్ప్రియకరమైన భాగవతశేషత్వమునే ప్రధానార్థముగా సాధించియున్నారుగనుక భగవచ్ఛేషత్వమునకు విరోధులైన అహంకార మమకారములను నశింపజేసి ఆభగవచ్ఛేషత్వమును ప్రకాశింపజేయుచున్న ఈనమఃపదమందు భాగవతశేషత్వమును కూడా అనుసంధించవలయును.

౯౦. జీవునియొక్క శేషత్వమును చెప్పుచుండెడు లుప్తచతుర్థీతో కూడుకొనియున్న అకారమందును ఈభాగవతశేషత్వమున్నదని కొందరు చెప్పుదురు, అనన్యార్హశేషత్వమును చెప్పుచుండెడి ఉకారమందును ఈభాగవతశేషత్వమున్నదని కొందరు జెప్పుదురు.

౯౧. ఈశ్వరుడు ఎల్లప్పుడు స్వతంత్రుడయ్యేయుండుననియు అచిత్తు అనగా ప్రకృతి చైతన్యములేనిపదార్థమగుటచేత స్వాతంత్ర్యములేక ఎల్లప్పుడు పరాధీనమయ్యే యుండుననియు, ఆత్మజ్ఞానముకలవాడగుటచేత స్వతంత్రుడనియు, శేషత్వముకలవాడగుటచేత ఈశ్వరపరతంత్రుడనియు, ప్రణవమందు చెప్పబడుచున్నది. ఈనమఃపదమందు ప్రణవమందువలెగాక అచిత్తునుపరార్థముగానేపరిగ్రహించునట్లు కేవల ఈశ్వరునకేప్రియమగునట్లు తన్ను పరిగ్రహించవలెనని ఆత్మప్రార్థించు ప్రార్థన చెప్పబడుచున్నది.

౯౨. ఈశ్వరసన్నిధిని జీవుడు కైంకర్యముచేయు దశలో ఈశ్వరుడువీనియందు మోహముచేతను తనస్వామిత్వమును వీనియందుంచి వీని శేషత్వమును తానుఅవలంబించి వీని (జీవునియొక్క)

శేషత్వమును చెడగొట్టునప్పుడు తన శేషత్వమును కాపాడుకొనుట
కై ఈశ్వర భోగమునకు ప్రతిబంధము కలుగచేయకూడదు.

౯౩. ప్రణవమందును నారాయణపదమందును ఆత్మకు భగవచ్ఛేషత్వమును శేషత్వోచితమైన కైంకర్యమును స్వరూపముగాం చెప్పచుండగా అందుకు విరోధముగా భగవంతుడు ఆత్మకత్యంతానుకూలుడుగానున్నట్లు భోగదశయందు కనుపడుచు బోవునప్పుడు తన శేషత్వమునకు భంగము కలుగునేమో యను సంశయముతో ఈశ్వరుని యొక్క భోగమునకు భంగము కలుగజేయకూడదు. అని తాత్పర్యము.

౯౪. ఇదివరలో చెప్పిన పారతంత్ర్య జ్ఞానము యొక్క వైభవమేమనగా "భగవదేక శేషముగా నేనన్ను పరిగ్రహించవలెను" అనెడియీ పారతంత్ర్యజ్ఞానము పుట్టినమాత్రముచేతనే ఈ ఆత్మ కృతకృత్యుడగుచున్నాడు. అనగా తన పురుషార్థమై చేయవలసిన పనులన్నియు చేసిన వాడగుచున్నాడు. ఈ అతిదివ్యపారతంత్ర్యజ్ఞానము లేనివ్వాడు ఆత్మాపహారము మొదలగు సకల దుష్కృతములును చేయబడినవే. ఈ అతిదివ్య పారతంత్ర్య జ్ఞానమున్న మాత్రముచేత సర్వేశ్వరునకు సకల సుకృతములను చేసినవాడయి యుండగలిగెడు ప్రీతి కలుగును. ఈ అతిదివ్య పారతంత్ర్యజ్ఞానము లేకుండా యీశ్వర ప్రీతి కొరకును తన పాపములు నశించుటకొరకును చేయు యజ్ఞాదులును ప్రాయశ్చిత్తాదులును నిష్ప్రయోజనములగును. ఈ పారతంత్ర్యజ్ఞానము కలిగినమాత్రము చేత సమస్త పాపములును పోయి సమస్త ఫలములును సిద్ధించును.

౯౫. నారాయణ పదమునకు అర్థమేమనగా.

(౧) నారాణాం అయనం యః సః నారాయణః అనియు (౨) నారాః అయనం యస్య సః నారాయణః అనియు తత్పురుష బహువ్రీహి సమాసములు రెండింటి చేతను ఈ నారాయణ పదము రెండర్థములను జెప్పుచున్నదగుట చేత ముందు తత్పురుష సమాసార్థము చెప్పబడును.

(౧) నారాణాం నారములకు, అయనం స్థానము, యః ఎవ్వడో, సః వాడు, నారాయణః నారాయణుడు.

ఈ సమాసమందు అయనపదమునకు ప్రాప్యము అనగా ఫలమున్ను ప్రాపకము అనగా ఉపాయమున్ను అర్థము లగుచున్నవి. ఇవి ముందు వివరింపబడును.

౯౬. నారములనగా నశించనివస్తువులయొక్క సమూహములు. 'రిఙ్ క్షయే' అను ధాతువుపైని పుట్టిన 'ర' అనుపదమునకు నశించువస్తువు అర్థమై "నర" అని నకారము దానితో కలిసి నాశములేని వస్తువును జెప్పును. సమూహార్థమందు అణ్ ప్రత్యయమున్ను ఆదివృద్ధియునువచ్చి 'నారః' అనుపదమై నిత్యవస్తువులయొక్క సమూహమును చెప్పును. నారాః అనుబహువచనము సమూహముయొక్క బాహుళ్యమును జెప్పును.

౯౭. ఆ నిత్యవస్తుసమూహము లేవనగా:—

(౧) ఈశ్వర స్వరూపమును నిరూపించు, అనగా నిర్ణయించు, జ్ఞాన ఆనంద అమలత్వాదులును, వాటిచే నిర్ణయింపబడిన ఈశ్వరస్వరూపమునకు విశేషణములై సకల గుణ ప్రధానములైన ౧ జ్ఞానము ౨ శక్తి ౩ బలము ౪ ఐశ్వర్యము ౫ వీర్యము ౬ తేజస్సు అనుషడ్గుణములును, ఆషడ్గుణములకు ఆశ్రయములైన ౧ వాత్సల్యము ౨ స్వామిత్వము ౩ సౌశీల్యము ౪ సౌలభ్యము మొదలైన అనన్తకల్యాణ గుణములును, పరమపదమందు నిత్యముగానుండు దివ్యమంగళవిగ్రహంబును, ఇచ్ఛచేత పరిగ్రహించు అవతారాది సకల దివ్యమంగళ విగ్రహములును, ఆవిగ్రహ గుణములైన సౌందర్యము సౌకుమార్యము సౌగంధ్యము లావణ్యము యౌవనము మొదలగునవియును, ఆవిగ్రహమందు ధరింపబడు అనన్తదివ్యాభరణములును, శంఖము చక్రము గద ఖడ్గము ధనుస్సు మొదలయినఅనంతాయుధములును, శ్రీదేవి భూదేవి మొదలగు అనన్తదేవులును, అనన్త గరుడ విష్వక్సేనులు మొదలుగాగల అనన్తనిత్యసూరులును, కైంకర్యోపకరణములైన ఛత్రములు చామరములు తాళవృంతము

లు (అనగా విసనకఱ్ఱలు) భృంగారులు (దాహార్థజలములను ఉం
చుకొను గిండీలు) పతద్గ్రహములు (అనగా పీకదానులు) మొదల
గునవియును, ద్వారములను కాచు చండ ప్రచండ భద్ర సుభద్ర జ
య విజయ ధాతృ విధాతృలు మొదలగు ద్వారపాలకులును, కుము
దకుముదాక్షపుణ్డరీకవామనశంకుకర్ణ సర్పనేత్రసుముఖసుప్రతిష్ఠి
తాదిసేనాధిపతులును, సంసారసంబంధమును విడిచిపరమపదమున
కు వెళ్లి నిత్యులతోసమానమైన దివ్యశరీరములనుపొంది సకలకైం
కర్యములనుజేయు అనన్తముక్తాత్మలును, పంచోపనిషన్మయమైన
పరమపదమ్మును (పంచోపనిషత్తులనగా పరమేష్ఠిశక్తియును పు
రుషశక్తియును విశ్వశక్తియును నివృత్తిశక్తియును సర్వశక్తియు
ను అనుపేర్లుగలవి. ఈ అయిదింటిని పంచోపనిషత్తులని పాంచ
రాత్రము చెప్పుచున్నది. ఈజగత్తు పంచభూతాత్మకమైనట్లు ఆ
పరమపదము పంచశక్తిమయమని పాంచరాత్రమందు చెప్పబడి
యున్నది) సత్త్వరజస్తమోగుణాత్మకమై లీలావిభూతికి కారణ
మై ఈశ్వరునికి లీలోపకరణమైన మూలప్రకృతియును, మైనము
లో అంటుకొనియున్న బంగారురేణువులవలెనే మూల ప్రకృతిలో
అంటుకొనిపోయి కరణకళేబరములులేక అచిత్ప్రాయులై పడియు
న్న బద్ధాత్మలును, క్షణలవాదిరూపమైన కాలమ్మును, మూల ప్ర
కృతి వికారమైన మహదాదులును, మహత్తు అహంకారము పృ
థివ్యాది పంచభూతములు గంధాదిపంచవిషయములు త్వగాది పం
చజ్ఞానేంద్రియములు వాగాది పంచ కర్మేంద్రియములు మన
స్సను జ్ఞానేంద్రియము ఈయిరువదినాలుగు వికారములును, అన
న్తకోటిబ్రహ్మాండములును, ఆబ్రహ్మాండములలోపలనుండు దేవత
లు మనుష్యులు పశుపక్ష్యాదులు వృక్షాదులు ఈ మొదలయిన సమ
స్తమున్ను నిత్యవస్తుసమూహమనబడును.

ఈ నిత్యవస్తువులు రెండువిధములు. ౧-స్వరూపతో నిత్యము
లనియు, ౨-ప్రవాహతో నిత్యములనియు.

స్వరూపతోనిత్యములనగా ఎప్పుడైనను ఏవిధమైన మా

ర్వ్యములను లేక యేకాకారముగానుండు పదార్థములు. అవిజ్ఞానానందామలత్వాదులు మొదలుకొని కాలము వరకు పైని చెప్పబడిన పదార్థములు.

ప్రవాహతో నిత్యములనగా ఉత్పత్తివినాశాదివికారములవల్ల కలుగు రూపభేదములున్నప్పటికిని స్వరూపాదులకు నాశములేని పదార్థములు. ఇవి మహత్తాదులు మొదలుకొని దేవాదిపదార్థముల వరకును పైని చెప్పబడినవి.

౯౮. ఆధారవాచియైన 'అయన' శబ్దము, ఈ నిత్యవస్తువులకు ఈశ్వరస్వరూపము ఆధారమని చెప్పుచున్నది.

౯౯. పైని చెప్పిన తత్పురుషార్థముగాక "నారాః అయనం యస్య సః" అను బహువ్రీహి సమాస ప్రకారముగా 'ఈ నిత్యవస్తుసమూహములు ఆశ్రయముగా గలవాడు, అనగా, స్థానముగా గలవాడు అనియు చెప్పుదురు.

"నారాః నారములు, అయనం స్థానము, యస్య ఎవనికో, సః వాడు, నారాయణః అనబడుచున్నాడు" అని బహువ్రీహిసమాసార్థము. తత్పురుషసమాసమందు ఈశ్వరుని కల్యాణగుణములనుకూడ నారశబ్దవాచ్యములుగా తీసికొనినప్పటికిని ఈ బహువ్రీహిసమాసమందు వాటిని విడిచి తక్కినవాటినే తీసికొనవలసియుండును. అలాగున తీసికొననియెడల ఆత్మాశ్రయము, అనవస్థ, అను రెండుదోషములు వచ్చును. ఆత్మాశ్రయమనగా తనయందు తానుండుట; అనగా తనకు తానే ఆధారమై యుండుట. లోకములో ఒకమనిషి తన మెడపైని తాను ఎక్కికూర్చుండుటవలెనే అసందర్భముగా గనబడును. ఎట్లనగా- ఈశ్వరుడు సగుణుడగుటచే తనగుణములలో ప్రవేశించునపుడు సగుణుడయ్యే ప్రవేశించవలెను; అట్లు ప్రవేశించునపుడు ప్రవేశింపబడుచున్న గుణములే ప్రవేశించువాని గుణములై యుండుటవల్ల వాటికిని వీటికిని భేదములేక ఆత్మాశ్రయమను దోషము వచ్చును. అనవస్థాదోషమనగా పరిసమాప్తి లేకపోవుట. ఆ

త్యాశ్రయదోషమును పోగొట్టుటకై ఈశ్వరునియందున్నగుణములకును ప్రవేశింపబడు గుణములకును స్వరూపభేదమునంగీకరించు పక్షమున ప్రవేశింప బోవునపుడు ఈశ్వరుని యందును గుణములయందును ఒరుగా గుణవిశిష్టుడయ్యే వ్యాపించవలసియుండును. ఇందువల్ల బహుగుణకల్పనము వచ్చును, గనుక అనవస్థాదోషము తప్పదు.

౧౦౨. ఈ తత్పురుష, బహువ్రీహి, అనెడు రెండు సమాసముల చేత కలిగినఫలితము ఏమనగా సమస్తపదార్థములకు ఆధారమై యుండుట యనెడు పరత్వము అనగా ఆధిక్యము, తత్పురుషవల్లనున్ను ఇట్టి అధికుడైన తాను సకల చేతనాచేతనముల యందును అమరి అంతర్యామిగా నుండుటవల్ల వచ్చిన సౌలభ్యము అనగా సర్వసులభత బహువ్రీహిసమాసమువల్లనున్ను ఫలించినవి--

౧౦౩. ఈ రెండుసమాసములవల్లనున్ను అంతర్యామిత్వము, ఉపాయత్వము, ఉపేయత్వము కూడ చెప్పబడుచున్నవి- బహువ్రీహిసమాసము చేత అంతర్యామి బ్రాహ్మణము మొదలైన ఉపనిషత్తులయందు "యస్యాత్మాశరీరమ్- య ఆత్మానమన్తరో యమయతి- యమాత్మా న వేద" ఇత్యాది వాక్యములలో చెప్పిన ప్రకారముగా సమస్త పదార్థములకు అంతర్యామిగానుండి నియమించువాడై వర్తించుచుండు అనెడు అంతర్యామిత్వము చెప్పబడుచున్నది-

యస్యాత్మాశరీరమ్- యస్య, పరమాత్మను- ఆత్మా, జీవాత్మ- శరీరం- శరీరమో- య ఆత్మానమన్తరో యమయతి- యః, పరమాత్మ-ఆత్మానమ్, ఆత్మను- అన్తరః, అంతర్యామియైనవాడై- యమయతి, నియమించుచున్నాడో- యమాత్మా న వేద- యమ్, పరమాత్మను- ఆత్మా, జీవాత్మ- న వేద, ఎరుగడో- అని శ్రుతికి అర్థము-

తత్పురుషసమాసము చేతను 'ఇణ్ గతౌ' అనుధాతువు వల్లగాని, 'అయగతౌ' అనుధాతువువల్లగాని సిద్ధించిన ఈ అయన పదమందు 'ఈయతే అనేనేత్యయనమ్' అను కరణే వ్యుత్పత్తి వల్లనున్ను, 'ఈ

యతే ఇతి అయనమ్' అను కర్మణివ్యుత్పత్తివల్లనున్ను, ఉపాయ త్వమున్ను, ఉపేయత్వమున్ను క్రమముగా చెప్పబడుచున్నవి. 'ఇణ్' అనుధాతువునకు 'పొందుట' అర్థము. 'అయ' అను ధాతువునకున్ను పొందుటయే అర్థము.

'ఈయతే అనేన ఇతి అయనమ్'- అనేన,దీనిచేతను- ఈయతే,పొం దింపబడును. కాగా అయనమ్ అని కరణేవ్యుత్పత్తికి అర్థము.

ఈయతే ఇతి అయనమ్- పొందబడుచున్నది కాగా అయనమ్ అని కర్మణివ్యుత్పత్తికి అర్థము.

కరణార్థమును చెప్పునది కరణేవ్యుత్పత్తి(కరణవ్యుత్పత్తి) అనబడును. మనము పొందుఫలమునకు ఈశ్వరుడు కరణమైన అనగా సాధనమైన, ప్రకారమును చెప్పుచున్నది గనుక కరణేవ్యుత్పత్తి అనబడును.

కర్మార్థమును చెప్పునది (కర్మణివ్యుత్పత్తి) కర్మవ్యుత్పత్తి అనబడును. పొందబడువాడు ఈశ్వరుడే గనుక కర్మత్వమువచ్చుటవల్ల కర్మణివ్యుత్పత్తి అనబడును.

తత్పురుషసమాసమందు ఉపాయత్వమును ఉపేయత్వమును అర్థము చెప్పునప్పుడు నారశబ్దమునకు అచేతనములనువిడిచి చేతనములనుమాత్రమే అర్థముగా చెప్పవలెను. అచేతనములకు జ్ఞానము లేదుగనుక జ్ఞానకార్యమైనఉపాయత్వ ఉపేయత్వములు లేవని వసిష్ఠస్మృతి మొదలగువాటియందు చెప్పబడుచున్నది.

౧౦౨- ఈనారాయణశబ్దార్థమును తిరుమంగై ఆళ్వారులు అనుసంధించునప్పుడు ఈశ్వరునియొక్క సర్వవిధబంధుత్వమును పాయించినందువల్ల అయనపదమందు బంధుత్వప్రయుక్తమైన ప్రాప్యత్వమున్ను చెప్పబడుచున్నది- ఈబంధుత్వప్రయుక్తమైన ప్రాప్యత్వమే గాక యీఅయనపదమందు ఈశ్వరునియొక్క సర్వవిధ ప్రాప్యత్వమున్ను చెప్పబడును.

౧౦౩- ఈశ్వరునితో మనము ద్వేషించి అన్యశేషభూతులమై పోయినప్పుడున్ను ఆయన మనను విడువక మనకు మంచిచేయుచుండును- ఇందువల్లను ఈశ్వరుడే నిరుపాధికబంధువని యూ

కొంపడగియున్నది-

౧౦౪- మనకు ఈశ్వరుడు చేయుమంచి యేమనగా- లోకములో దుర్మార్గుడైన కొమారుడు హితవుచెప్పిన తండ్రితో ద్వేషించి ఆయననువిడిచి పైకివెళ్ళిపోయి ఉపవాసముగానున్నప్పుడు వానియందలి దయచేతను పోషించకుండజాలక వాడు ఉండుస్థలమునకు ఎవ్వరికిని తెలియకుండా తానుపంపించినట్లు అన్వయించకుండా ఆహారము మొదలయిన వాటిని పంపించి రక్షించు ప్రకారముగా ఈశ్వరుడును తనయొద్ద శేషపడక ఈచేతనులు స్వాతంత్ర్యమై తిరుగుచున్నప్పటికి తాను ప్రియుండలి కృపచే పోషించకుండజాలక మొదటవద్దు స్వయముగా రక్షించెదమంటే అంగీకరించరేమో యని అంతర్యామియైయుండి సమస్తరక్షణలున్ను చేయుచు నుండును.

౧౦౫. ఆయ. అనుచతుర్థీ చేతను అనంతాళ్వారులుచేయు కైంకర్యమువలెనే సర్వవిధకైంకర్యములను చేయవలెనని చేతనుడుప్రార్థించుచున్న ప్రార్థన చెప్పబడుచున్నది.

ఈశ్వరునికి ఎండవానలు తగిలకుండ ఛత్రముగాను, కూర్చుండుచో సింహాసనముగాను, నిలువబడునపుడు పాదుకలుగాను, క్షీరాబ్ధియందు పవళించునపుడుపరుపుగాను, పిరాట్టితో వేంచేసియున్నప్పుడు మంగళదీపముగాను, ధరించుటకు పట్టువస్త్రముగాను, చేరబడుటకు ఛారీసుగానున్ను ఇంకా ఆయా యవస్థలయందు ఆయారూపములుగానుండి సర్వశేషవృత్తులను చేయుటచేతనే అనంతాళ్వారులకు శేషుడను తిరునామము అనగా పేరువచ్చినదని ఆళ్వారాచార్యులు పాయించియున్నారు.

౧౦౬- నమః అనుపదము చేతను చేతనుడు తనకుఅని దేనినిన్ని ఆదరించుటకు అవకాశములేని పారతంత్ర్యమును చెప్పబడియుండగా ఈచతుర్థియందు కైంకర్యమునాపేక్షించి ప్రార్థించుట కూడునా అంటే లేదు.

౧౦౭ అనిద్వారాపారతంత్ర్యమును నమః పదమునందు జెప్పిన

ష్పటికిని ఈ కైంకర్య ప్రార్థన యనుచేత స్వభోక్తృత్వరూపమై
న అహంకారమూలముగా వచ్చియుండలేదు గనుకనున్నూ, సర్వే
శ్వరుని ప్రీతి చేయడమే స్వరూపముగాగల శేషత్వప్రయుక్త
మై వచ్చినదిగనుకనున్నూ అనగా అచిత్తువలె పడియుండి కైంకర్య
ము చేతునుగాక అని అత్యంతపారతంత్ర్యముతో కూడ ఈ కైంక
ర్యమును శ్రీకులశేఖరాళ్వారులు ప్రార్థించినందువల్ల ఇది స్వ
రూపవిరుద్ధముకాదు- అనగా స్వరూపమునకు ఉచితమైనదే-

౧౦౮- అందుచేతను సర్వవిధకైంకర్యములు ఎడతెగకుండా
మేము చేతుముగాక అని ఆళ్వారులు ప్రార్థించిన కైంకర్యప్రా
ర్థనము ఈ చతుర్థీవిభక్తి చెప్పుచున్నది-

౧౦౯- ఈశ్వరుని సేవించనుగాని మనస్సుమపట్టలేనివారికి
సేవించువరకును నిద్రపట్టదు. సేవించినతరువాత "సదాపశ్యన్తి
సూరయః" అను శ్రుతిప్రకారముగా ఈశ్వరునియొక్క నిత్యా
నుభవ నిత్యకైంకర్యములను జేయుటచేత నిద్రపట్టదు- స
దాపశ్యన్తి సూరయః అను శ్రుతికి సూరయః అనంతగరుడవిష్వక్సే
నాదులను నిత్యసూరులు, సదా ఎల్లప్పుడును, పశ్యన్తి చూచుచు
న్నారు అనగా సేవించుచున్నారు- అని యర్థము.

౧౧౦- ఈశ్వరుని సేవించినపిమ్మట ఈలాగు నిత్యసేవయు ని
త్యానుభవము, చేయవలసిన కాలమంతయు సంసారములో పడి
వ్యర్థముగా పోగొట్టుకొంటినే అని అదివరలో గతించిన కాలమును
గూర్చి దుఃఖించుచుండు చేతనునికి మరి నిద్రవచ్చునా-

౧౧౧- ఈశ్వరజ్ఞానము కలుగనప్పుడు నేను నేనివాడను- జ్ఞా
నము కలిగిన తరువాత మరిమరి చిదయెఱుగను అని ఆళ్వారులు సాయిం
చుటచేతను ఈ భగవద్జ్ఞానము కలవారికి నిద్ర లేకపోవడము స
రేగదా మరపుకూడా కలుగదు-

౧౧౨- ఈశ్వరకైంకర్యమందు ఆసక్తి గలవారిస్థితి ఇదిగనుక
ఈ కైంకర్య ప్రార్థన సర్వదేశ, సర్వకాల సర్వావస్థలయందును
అనువర్తించేయుండును స్వరూపవిరుద్ధముకాదు-

౧౧౩. భార్యకు మంగళసూత్రధారణమువల్ల భర్తకే అర్హురాలు అన్యులకు అర్హురాలుకాదు అనే అంశమును కనపర్చునట్లుగా తిరుమంత్రోపదేశమువల్ల చేతనులు ఈశ్వరునకే అర్హులుగాని అన్యులకు కాదు అను అంశమును కనపరచుటకై ఈ అష్టాక్షరీ మంత్రమును మంగళసూత్రముగా నిరూపించుచున్నారు.

పదునారు దారములతో చేసి రెండు పేటలుగా కట్టబడిన లౌకిక మంగళసూత్రమువలెనే గాక ఎనిమిది దారములతో చేసి మూడు వరుసలుగా కట్టబడిన మంగళసూత్రమువలెనే ఎనిమిది అక్షరములతో కూర్చబడి మూడు పదములుగా ఏర్పరుపబడిన తిరుమంత్రము ఈశ్వరునిచేత ఆత్మకు కట్టబడిన మంగళసూత్రము. ఇందువల్ల తిరుమంత్రోపదేశము ఆత్మలకు ఆవశ్యకము.

౧౧౪. ఇందువల్ల తిరుమంత్రముతో సంబంధముగల ఆత్మలకు ఈశ్వరుడు పతియై ఉండి రక్షించును.

౧౧౫. తిరుమంత్రములో విస్తారముగా చెప్పిన అర్థమును సంగ్రహముగా సాయించుచున్నారు.

అకారవాచ్యుడై సర్వరక్షకుడైన సర్వేశ్వరునకే శేషభూతుడనైన నేను నాకుగాని అన్యులకుగాని శేషభూతుడను కాకపోవలయును. సర్వశేషి అయిన శ్రీమన్నారాయణునికే సర్వవిధకైంకర్యములను చేయుదునుగాక అని చేతనుడు చేయు ప్రార్థనను ఈ మంత్రము చెప్పుచున్నది.



## ద్వయప్రకరణము-

తిరుమన్త్రములో నమః పదముచేత చెప్పబడిన ఉపాయత్వమునున్ను, నారాయణపదములో చెప్పబడిన ఉపేయత్వమునున్ను, అనగా ఫలమునున్ను "శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే" అనుపూర్వవాక్యముచేతనున్ను, "శ్రీమతే నారాయణాయ నమః" అనుఉత్తరవాక్యముచేతనున్ను క్రమముగా అందరికి విశదముగా తెలియునట్లు చెప్పుచుండుటచేతను ఈమంత్రమునకు ద్వయమను పేరు కలిగినది- ఈప్రకరణములో దానిఅర్థమును చెప్పుటచేతను ఇది ద్వయప్రకరణము అనబడుచున్నది-

ఈమంత్రము శ్రీవిష్ణులోకమందు పెరియపిరాట్టికి శ్రియఃపతిచేత నుపదేశింపబడినది- ఆమెవల్ల శ్రీవిష్వక్సేనులవారికి ఉపదేశింపబడి వారిద్వారా శ్రీమన్నమ్మాళ్వారులకు లబ్ధమై ఉపదేశపరంపరగా వచ్చుచున్నది-

వైష్ణవునకు అవశ్యముగా నుండవలసినలక్షణములు:— సర్వధర్మాన్పరిత్యజ్య అనినప్రకారముగా ఈశ్వరునికంటె నితరములయిన వాటియందు అనగా కర్మజ్ఞానాదిఉపాయములయందును దారపుత్రాది విషయములయందును సంబంధమును విడుచుకొనుటయు, మామేకం శరణం వ్రజ అనిన ప్రకారముగా సర్వరక్షకుడైన సర్వేశ్వరుడే రక్షకుడని ఆశ్రయించుటయు, మనము చేయు ప్రపత్తి బహు స్వల్పమయినప్పటికిని మనయందు కల దోషములు మిక్కిలి అధికములయినప్పటికిని మనము పొందవలసిన ఫలము మిగుల గొప్పదయినప్పటికిని మనము రక్షకముగా ఆశ్రయించు సర్వేశ్వరుడు మనకుఫలమును తప్పకయిచ్చునను నమ్మకమున్ను ఆఫలసిద్ధికొరకు త్వరపడుటయు ఈవిభూతియందు తానుసజీవుడైయుండు దినములలో శ్రీరంగాది దివ్యస్థలములయందు ఈశ్వర గుణానుభవ కైంకర్యములతో కాలమువెళ్లపుచ్చుటయును ఈప్రకారము

గా కాలక్షేపమును జేయుచున్న భాగవతులయొక్క అతిశయము నుజూచునప్పుడు అసూయపడక సంతోషించుటయును తిరుమంత్రద్వయ నియమము కలవాడై యుండుటయును అనగా ఇతరమంత్రములయందు పనుదపాటై నమ్మకముంచక ఈతిరుమంత్రద్వయములయందు చెప్పబడిన అర్థమును తాను ఆచరించుటయును ఇట్టి రహస్యను ఉపదేశాదులచేతను తనకు కలుగజేసిన ఆచార్యవిషయమందు భక్తి అతిశయించి యుండుటయును అసత్ప్రాయుడై పోవుచున్న తనను ఈప్రకారముగా దిద్దిన ఆచార్యునియందును ఇట్టి ఆచార్య సంబంధమును కలుగజేసిన యీశ్వరుని యందును ఉపకారస్మృతి కలిగి యుండుటయును అచిచ్చిదీశ్వర తత్త్వవిషయమయిన యథార్థజ్ఞానమున్ను క్షుద్రవిషయ విరక్తియున్ను ఇవితనకు కలవని గర్వించకుండుటయనెడు శాంతియును గల పరమసాత్వికులతో సహవాసము చేయుటయును వైష్ణవునకు అవశ్యము అపేక్షితములు.

౨. ఇట్టి వైష్ణవుడు జ్ఞానానుష్ఠానములను వృద్ధిపొందించుటకు ద్వయ చరమములను నిత్యము అనుసంధింపవలయును.

౩. సకల శాస్త్రములయందును కర్మజ్ఞానాదిసాధనానుష్ఠానమునకు యోగ్యమైన దేహముచేతనే మోక్షరూపమైన ఫలసిద్ధి కలుగునని చెప్పబడుచున్నది.

తిరుమంత్రమందు ఈశ్వరుడే తనకు రక్షకుడు, తాను గాని అన్యులుగాని కారని పారతంత్ర్యజ్ఞానముచేత ఈశ్వరుడు తన్ను రక్షించుటకు విరోధి అయిన స్వవ్యాపారమును విడిచియున్న ఆత్మచేతనే పురుషార్థసిద్ధి కలుగునని చెప్పబడుచున్నది.

చరమశ్లోకమందు ఈ జీవుడు చేయు ప్రపత్తిని అపేక్షింపక తానే నిర్హేతుకముగా కటాక్షించి ప్రాప్తిప్రతిబంధకములైన సకలపాపములను పోగొట్టి తన సన్నిధానమునకు చేర్చుకొను ఈశ్వరుని చేతనే పురుషార్థసిద్ధి కలుగునని చెప్పబడుచున్నది.

ద్వయమందు భగవదేక శేషభూతులకు పెరియ పిరాట్టి

యార్కచేతనే పురుషార్థసిద్ధి కలుగునని చెప్పబడుచున్నది.

౪. ఈ చేతనులకు సకలవిరోధులను పోగొట్టి సకలఫలములనిచ్చువాడు ఈశ్వరుడయి యుండగా ఈ పెరియపిరాట్టియారి చేతను పురుషార్థసిద్ధి కలుగుటయెట్లనగా ఈమె పురుషకారము చేసే తప్ప ఈశ్వరుడు చేతనుని కార్యము చేయడు కాబట్టి ఈమెవల్లనే పురుషార్థసిద్ధి కలుగును. పురుషకారమనగా, పురు- సనోతీతి పురుషః, పురు అధికముగా, సనోతి, ఇచ్చుచున్నాడు కాగా పురుషః అనిపించుకొనుచున్నాడు, పురుషం, కరోతీతి, పురుషకారః పురుషం అధికదాతనుగా, కరోతి, చేయుచున్నది. కాగా పురుషకారః- అనిపించుకొనుచున్నది. పురుషకారమని, పిరాట్టికి నామముగా పూర్వాచార్యులు వ్యవహరించుచున్నారు. ఈ పురుషకారత్వమనే ధర్మము పెరియపిరాట్టి వారిదే అయినా గురులది కాకపోవుట చేతను పురుషకారత్వమనే ధర్మమే నిరూపకమైన నామధేయమయి యున్నది.

౫. ఉపాయాంతర శూన్యత్వమనెడు ఆకించన్యము, రక్షకాంతర శూన్యత్వమనెడు అనన్యగతిత్వమున్ను గలవాడే ద్వయానుసంధానమునకు అధికారి అగును.

౬. ఆకించన్య, అనన్యగతిత్వములనెడు రెంటినిగూర్చి ప్రపన్న ప్రపరిత్రాణమనెడి గ్రంథములో విశదముగా చెప్పబడి యున్నది.

౭. ఈ ద్వయమంత్రమందలి శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే అను పూర్వఖండము చేతను పెరియ పిరాట్టిని ముందుంచుకొని సర్వేశ్వరుని తిరువడిగళ్లను ఉపాయముగా ఆశ్రయించుట చెప్పబడుచున్నది.

శ్రీమతేనారాయణాయనమః- అను ఉత్తరఖండము చేత, శ్రీ, శ్రియః పతుల సన్నిధిని చేయు కైంకర్యప్రార్థన చెప్పబడుచున్నది.

వ్యా: శ్రీః అనగా పెరియ పిరాట్టి నాచియారు;

రక్షకత్వాదులకు వాచకమైన అకారము ఈశ్వరునికి ప్రథమ నామధేయమగునట్లు పురుషకారత్వమునకు వాచకమైన ఈ శ్రీ శబ్దము లక్ష్మికి ప్రథమనామధేయము.

౯. ఈ శ్రీశబ్దమునకు 'శ్రిఞ్ సేవాయామ్' అను ధాతువు నందు, శ్రీయతే, ఇతి శ్రీః, శ్రయతే ఇతి శ్రీః, అని సిద్ధమైన కర్మణి వ్యుత్పత్తినిన్ని, కర్తరివ్యుత్పత్తినిన్ని చెప్పుచున్నారు.

౧౦. శ్రీయతే అను వ్యుత్పత్తికి, శ్రీయతే ఇతి శ్రీః, చేతనుల చేత ఆశ్రయింపబడుచున్నది అని అర్థము.

శ్రయతే అను వ్యుత్పత్తికి శ్రయతే ఇతి శ్రీః భగవంతుని ఆశ్రయించుచున్నదని యర్థము.

౧౧ ఈశ్వరునకు ఉపాయత్వ, ఉపేయత్వములను రెండు ఆకారములున్నట్లు ఈ పిరాట్టికిని, పురుషకారత్వ ఉపేయత్వము లనెడు రెండు ఆకారములు గలవు. ఈ ద్వయముయొక్క పూర్వ వాక్యమందు చేతనుడు ఈశ్వరుని ఆశ్రయించుట చెప్పబడుచున్నది. గనుక ఆ, ఆశ్రయణమునకు పురుషకార మావశ్యక మయ్యుం డుటచేతను ఈ పదమునందు పిరాట్టియొక్క పురుషకారత్వ మనెడు ఆకారము చెప్పబడుచున్నది. వడకలై వారు ఈశ్వరునకు ఉపాయత్వమును చెప్పిన ఈ పూర్వవాక్యమందు వానినిఁడునకుం డనుండు కల్యాణగుణములు వలెనే ఈ పిరాట్టి యున్న, ఆయన నువిడవకుండనుండుటచేతను ఈశ్వరగుణములకు ఉపాయత్వము న్నట్లు పిరాట్టికిన్ని ఉపాయత్వమున్నదని చెప్పుదురు. అట్లు పి రాట్టికి ఉపాయత్వమును చెప్పిన యెడల ఈశ్వరునికిని పిరాట్టి కిని ఉభయములకున్ను ఫలసాధకత్వము చెప్పబడి ఒకఫలమునకు రెండుసాధనములను చెప్పినదోషము వచ్చును ఈ దోషము ఉపా యత్వద్విత్వమని శాస్త్రమందు చెప్పబడుచున్నది. ఈ హేతువు చేతనున్ను ఈశ్వరునియొక్క నైరపేక్ష్యమునకు అనగా తాను జే యు కార్యమునకు అన్యసహాయమును సహింపకపోవుటకు భంగ ము కలుగుటచేతనున్ను పిరాట్టికి ఉపాయత్వమును చెప్పక పుష్ప

పకారత్వమునే తెన్కలై వారుచెప్పుదురు.
వడకలై అనగా ఉత్తరశాస్త్రము అనగా సంస్కృత శాస్త్రము, అది ప్రధానముగా గలవారు వడకలైవారు తెన్కలై అనగా దక్షిణ శాస్త్రము అనగా ద్రావిడ వేదము ఇది ప్రధానముగా గలవారు తెన్కలైవారు.
౧౨ ఈ చేతనుడు ఈశ్వరునకును తనకును కలిగియున్న స్వాభావికసంబంధమును తెలిసికొని ఆశ్రయించి ఫలమును సంపాదింపతగియుండగా ఈమె పురుషకారమెందుకంటే, చల్లనిజలమందు అతితీక్ష్ణమైన అగ్నిసెగాత్రము పుట్టినట్టుగా, సర్వభూతసుహృత్త్వము మొదలగు స్వభావములచేతను మిక్కిలిచల్లనైన ఈశ్వరహృదయమందు చేతనాపరాధములవల్ల వారి హితము నిమిత్తము కోపముపుట్టినప్పుడు దానినిపోగొట్టుకొనుటకు ఈపురుషకారముననుసమయుంచుకొనుట అవశ్యమపేక్షితము ఈమె పురుషకారానంతరమందే ఈశ్వరుడు క్షమించును.
౧౩, ఈపిరాట్టికి చేతనులతో మాతృత్వసంబంధముండుటచేత వీరిదుఃఖమును సహింపచాలక, వీరికిచేయవలయుకార్యములను తానుఅవలంబించియును ఈశ్వరునితో పత్నీత్వసంబంధముకలిగి ఆయనకు అత్యంత ప్రియురాలైయుండుటచేత ఆయనను వశపఱచుకొనియును ఉండునదగుటచేతను ఈమె చేయుపురుషకారమునకు ఏవిధమయిన ప్రతిబంధకమును ఉండదు.
౧౪. నిరంకుశస్వతంత్రుడయిన ఈశ్వరుడుచేతనులయొక్క అపరాధములను వారలకు అనుభవింపజేయదలంచినప్పుడు ఈపిరాట్టి తనపురుషకారముచేతను ఆయనను క్షమింపచేయగలదా అంటే ఆమె యొక్క సౌందర్యాదులయందు అతిమగ్నుడయియుండు తన భర్తను ఉచితోపాయములచేతను క్షమింపజేయునని వేరేచెప్పనక్కఱలేదు. ఈమె యొక్కసౌందర్యాతిశయమునకులోబడేగదా తనకురాగల అనర్థమునైనను విచారింపక మాయామృగము వెంటతనుబాణములతో బయలువెడలెను.

రావణవధానంతరము సీతాపిరాట్టికి శుభవార్త చెప్పుటకువచ్చిన తిరువడి అనగా ఆంజనేయుడు తాను మొదట వచ్చినప్పుడు ఈమెను బాధపెట్టుచూ వచ్చిన రాక్షస స్త్రీలను నిగ్రహము చేయుటకు సెలవడుగగా అనేక ప్రకారములచేతను ఈమె ఆయనను బోధించి క్షమింపజేసినదని శ్రీమద్రామాయణములో చెప్పబడియున్నది. ఇంతవట్టి ఔదార్యశాలియై చెప్పినట్లు వినక, పట్టినపట్టు విడువక పోవుటయే స్వభావముగాకల ఆంజనేయునే లోపరచుకొన్న ఈమె తనయందు మిక్కిలి ప్రేమగల ఈశ్వరుని స్వాధీనపరచుకొనుట అతిసులభము.

శ్రీమత్పదమందలి ప్రకృత్యర్థము అనగా శ్రీ అను పదముయొక్క అర్థము చెప్పబడెను.

౧౩. ఇకను ప్రత్యయార్థము అనగా మతుప్ అను ప్రత్యయార్థము చెప్పబడుచున్నది. ఈ మతుప్ అను ప్రత్యయమునకు నిత్యయోగము అర్థము, దీనిచేతను పురుషకారభూతురాలగు పిరాట్టియును ఉపాయభూతుడైన ఈశ్వరుడును అన్యోన్యము విడువకుండా సంశ్లేషించియుండే అనగా కలిసియుండే యునికి చెప్పబడుచున్నది.

౧౪. ఈశ్వరస్వరూపమునకు నిరూపకమైన జ్ఞానానందాదులకంటె శ్రియఃపతిత్వము ప్రధాన నిరూపకమగుటచేతను భాష్యకారులవారు ఈశ్వరస్వరూపమును నిరూపించునప్పుడు జ్ఞానానందాదులకంటె ముందుగా ఈ శ్రియఃపతిత్వమును గీతాభాష్యములో సాయించియుండుటవల్ల స్వరూపనిరూపకురాలైన ఈమెతోకూడియే ఈశ్వరునియొక్క యునికి అని చెప్పబడును.

౧౫. స్వరూపప్రయుక్త నిత్యయోగము ఇదివరకు చెప్పబడినది. ఇకను గుణప్రయుక్త నిత్యయోగము చెప్పబడును.

చేతనునియొక్క అపరాధములను అన్నిటిని అనుభవింపచేసి తాను రక్షింపుదునని సంకల్పించుకొన్న ఈశ్వరస్వాతంత్ర్యమునున్ను అనేక బ్రహ్మకల్పములనుభవించిన తీరని చేతనాపరాధములనున్ను

చూచి ఈ చేతనునికి ఏమిహాని సంభవించునో యనేడు భయము చేత ఈమె ఈశ్వరుని ఒకక్షణమయినను విడువజాలదు.

౧౮. పిరాట్టి యొక్క నిత్యసాన్నిధ్యమున్నదిగనుక ఈశ్వరుని యొక్క స్వాతంత్ర్యమున్ను తనయొక్క అపరాధములున్ను, చూచి ఈ చేతనుడు భయపడవలసిన పనిలేదు.

౧౯. పురుషకార ఉపాయభూతులయిన శ్రీ శ్రియఃపతుల యొక్క నిత్యయోగమును జెప్పుచున్న ఈమతుపు చేతను చేతనునికి భగవదాశ్రయణమందు రుచిపుట్టుటయే కావలసినది గాని ఆశ్రయించుటకు కాలనిరీక్షణము చేయనక్కరలేదని చెప్పబడుచున్నది.

౨౦. కాకాసురుడు ఈమె విషయమయి చేసిన మహాపరాధమునకు స్వామికోపించి బ్రహ్మాస్త్రమును ప్రయోగించి శిరచ్ఛేదము చేయుటకు సిద్ధపడియుండగా ఈమె స్వామి సన్నిధియున్న సమయమందు ఆకాకాసురుడు ఎనుటదీనతతో పడిన మాత్రము చేతను ఈమెపురుషకారముచేతనే స్వామికృపకు పాత్రుడై రక్షింపబడెను.

రావణుడు దీనిఅపరాధముకంటె తక్కువఅపరాధము చేసినవాడైనను రక్షకాంతస్వామున్నాడైయుండినను ఈమె సన్నిధిని లేని సమయమందెరుట పడుట చేత ఈమె పురుషకారములేక నశించిపోయెను గనుక ఈమెపురుషకారమావశ్యకము.

౨౧. ఇక నారాయణ పదము యొక్క అర్థము చెప్పబడును ఆశ్రయించుటకు వచ్చిన చేతనుడు చేసిన మహాపరాధములను చూచికోపించి శిక్షింపనుద్యోగించిన ఈశ్వరుని యొక్క స్వాతంత్ర్యము ఈమె యొక్క పురుషకారమునకు లోబడిపోయి ఇదివరలో ఆ స్వాతంత్ర్యముచేతను త్రొక్కివేయబడి తిరుగా విజృంభించిన వాత్సల్యాదిగుణములను ఈనారాయణపదము చెప్పుచున్నది.

౨౨. ఆగుణములేవనగా ౧ వాత్సల్యము ౨ స్వామిత్వము ౩ సౌశీల్యము ౪ సౌలభ్యమును ౧ జ్ఞానము ౨ శక్తి ౩ ప్రాప్తి ౪ పూ

రియున్ను, వాత్సల్యాదులు నాల్గున్ను, చేతనుడు ఈశ్వరుని ఆశ్రయించుటకు ఉపయోగించునవి వీటికి ఆశ్రయణసౌకర్యాపాదకగుణములని పేరు, జ్ఞానాదులు నాలుగున్ను ఈశ్వరుడు చేతనకార్యమును చేయుట కుపయోగించునవి, వీటికి ఆశ్రితకార్యాపాదకములని పేరు.

౧. వాత్సల్యమనగా వత్సయందు గోవునకు ఉండే ప్రేమాతిశయము, అనగా వత్సయొక్క మాలిన్యమును భోగ్యముగా స్వీకరించి పాలిచ్చి పెంచి, పరులవల్ల బాధరాకుండా రక్షించు ధేనువవలెనే ఈశ్వరుడు చేతనులయొక్క దోషములను భోగ్యముగా పరిగ్రహించి, తనకల్యాణగుణములతో పెంచి, యితరులవల్ల బాధరాకుండా రక్షించు గుణము, దీనికి దోషభోగ్యత్వమని పేరు.

౨. స్వామిత్వమనగా, స్వామియైయుండుట, అనగా ఈ చేతనులు విముఖులైన దశయందున్ను వీరలను విడువక సర్వవిధరక్షణమునకు హేతువయిన ఒక సంబంధవిశేషము.

౩. సౌశీల్యమనగా గొప్పవారు కొద్దివారలతో అరమరలేకుండా కలిసిమెలసి యుండేస్వభావము ఇది ఈశ్వరుని ఉభయవిభూతినాథత్వము చేతనైన్నూ, శ్రియఃపతిత్వము చేతనున్నూ వచ్చిన పరత్వమునున్నూ, చేతనునియొక్క నీచతనున్నూ చూచి ఆశ్రయణోన్ముఖుడైన చేతనుడు భయపడి వెనకతీయకపోవుట కుపయోగించు గుణము.

౪. సౌలభ్యమనగా సులభత్వము, అనగా కంటికి గోచరము కాని సర్వేశ్వరుడు చేతనుల యొక్క కంటికి గనబడి ఆశ్రయింపదగినట్లు సర్వసులభుడై యుండు గుణము.

౧. జ్ఞానమనగా, సర్వజ్ఞత్వము అనగా చేతనునికి పోగొట్టవలసిన విరోధులనున్నూ, ఇవ్వవలసిన ఫలములనున్నూ ప్రత్యక్షముగా చూడదగిన సామర్థ్యము.

౨. శక్తి అనగా అఘటితఘటనా సామర్థ్యము అనగా నీ

త్యసంసారులను నిత్యసూరులతో సమానులైన వారినిగా చేయ దగిన సామర్థ్యము.

౩. ప్రాప్తి అనగా శేషశేషిభావసంబంధము.

౪. పూర్తి అనగా అవాప్తసమస్తకామత్వము అనగా ఏవిధమైన లోపము లేకుండా సర్వసంపన్నుడైయుండుట.

౧౩. ఆశ్రయణోన్ముఖుడయిన చేతనుడు తన దోషములను చూచి భయపడకుండా ఉండుటకు దోషభోగ్యత్వమనెడు వాత్సల్యము హేతువగును.

ఈశ్వరుడు మనవాక్యమును చేయునో చేయడో యని సంశయముండక, చేయునని నమ్ముటకు స్వామిత్వము హేతువగును. ఉభయవిభూతినాయకత్వమునకు ప్రకాశకమయిన ఈస్వామిత్వము చూచి తనవంటి నీచులకు ఇంతగొప్పవారియొక్క ఆశ్రయణము దుర్లభమని వెంది విడవకుండానుండుటకు ఈసౌశీల్యము హేతువగును.

ఈశ్వరుడు కంటికి గోచరుడు కాడని ఉపేక్షించక కంటితో చూచి ఆశ్రయించుటకు సౌలభ్యము హేతువగును, విరోధులను పోగొట్టి భగవదనుభవము మొదలయిన ఫలములనిచ్చుటకు జ్ఞానశక్త్యాదులు హేతువులు.

౧౪. ఈపదమందు చెప్పబడిన సౌలభ్యము, వాత్సల్యాదుల కంటె ప్రధానమయిన గుణము.

ఈగుణము అర్చావతారమందే పూర్తిగానున్నది.

౧౫. పరవ్యూహములు మిక్కిలి దూరములగుట చేతనున్న రామ, కృష్ణాది విభవావతారములు కాలాంతరములందలివి అగుటచేతనున్ను కంటికిగోచరములుగాక దుర్లభములైయుండును. ఈ అర్చావతారము అట్లుగాక కంటికిగోచరమగునట్లు సర్వదా సమీపమునందుండి మిగులసులభముగా నుండును.

౧౬. ఆశ్రయణసౌకర్యాపాదకములుగాను, ఆశ్రితకార్యాపాదకములుగాను చెప్పబడిన ఈగుణములన్నియు మనము మనపేరు

మూళ్ల సన్నిధినే చూడదగినట్లుగా ప్రత్యక్షముగ కనబడుచున్నవి.

౨౭. మనతిరువారాధనలో వేంచేసియున్న పెరుమాళ్లు ధరించియున్న శంఖచక్రాద్యాయుధములు జ్ఞానశక్తులనున్ను, అభయహస్తము, వాత్సల్యమునున్ను, కిరీటము, స్వామిత్వమునున్ను, చిరునవ్వుతో కూడియున్న ముఖము, సౌశీల్యమునున్ను, సింహాసనమందున్న తిరువడిఘళ్లు, సౌలభ్యమునున్ను, ప్రకాశింపజేయుచున్నవి. గనుక వీటితో కూడుకొన్న అర్చావతారమే మనకు రక్షకము.

౨౮. ఆయుధములతోనున్ను ఆభరణములతోనున్ను వేంచేసియున్న ఈసుందరవిగ్రహమందే రక్షకత్వ భోగ్యత్వములు రెండును, ప్రకాశించుచున్నవి.

ఇట్లు పైని చరణ శబ్దార్థము చెప్పబడును,

౨౯. చరణౌ అనుపదమునకు, తిరువడిఘళ్లను అని అర్థము ఇది ద్వితీయాద్వివచనము.

౩౦. రెండుతిరువడిఘళ్లను చెప్పుచున్న ఈద్వితీయాద్వివచనముచేతను ఒక్కటైయుండక రెండుతామరపుష్పములవలె జోడుగానుండుటవల్ల కలిగిన సౌందర్యాతిశయమున్ను, ఏకవచన బహువచనములవలె ద్వివచనము రెంటికంటె మరియొకదానిని సహింపకపోవుటను బట్టి ఉపాయపూర్తియున్ను చెప్పబడుచున్నది.

౩౧. పురుషకారభూతురాలగు పిరాట్టియున్ను, ఉపాయభూతుడగు సర్వేశ్వరుడును ఎప్పుడయినను చేతనులను విడిచినప్పటికీ తిరువడిఘళ్లు తమ సౌందర్యాది వైలక్షణ్యముచేత ఈచేతనుల యొక్క మనస్సులను ఆకర్షించి యెన్నడూ విడవక వీరిరక్షణము దృఢముగా అవలంబించియుండును.

౩౨. వత్సజననమైన వెంటనే తల్లియొక్క అవయవాంతరములుండినప్పటికి తనకు ధారకమయిన క్షీరముతో గూడియున్న స్తనమందు నోరుపెట్టినట్లు శేషభూతుడయిన చేతనుడున్ను సర్వేశ్వరునియొక్క అవయవాంతరములున్నప్పటికి విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః అన్నట్టి ప్రకారముగా తనకు ధారకమయిన అమృత

ముఖ ప్రసవించు తిరువడిభుర్ల నే అగ్రియించుట ఉచితము-

విష్ణోః। వ్యాపకుడయిన సర్వేశ్వరునియొక్క, పరమేపాదర్యా దులచేత సర్వోత్కృష్టమైన, పదే, పాదమందు, మధ్వ ఉత్సః అమృతప్రవాహముకలదు-

౩౩. విగ్రహములో ఒక అవయవమునకు వాచకమయిన ఈచరణ శబ్దము చేతను, పెరియ పిరాట్టికి వాసస్థానమయినటువంటిన్ని, వాత్సల్యాది కళ్యాణగుణములకు ప్రకాశకమయినటువంటిన్ని నిందచేయడమే స్వభావముగాగల శిశుపాలునికూడా తన సౌందర్యములో మగ్నపరచుకొని ద్వేషమును పోగొట్టి తనదగ్గిరనిని చేర్చుకొన్నటువంటిన్ని దివ్యమంగళ విగ్రహము చెప్పబడుచున్నది-

౩౪. ఇట్టిపైని శరణ శబ్దార్థము చెప్పబడును-

శరణమ్ అనుపదమునకు ఇష్ట ప్రాప్తికిని, అనిష్టనివారణమునకును ఉపాయముగా అనగా సాధనముగా అని అర్థము-

ఈశరణశబ్దముకత్రించు వానినిన్ని, గృహమునున్ను, ఉపాయమునున్ను, చెప్పుచున్నప్పటికి ఇచ్చట ఒకటి ఉపాయమునే అర్థముగా పరిగ్రహింపవలయునని పాంచరాత్రమందు చెప్పబడుచున్నది-

౧. అనిష్టములనగా, అహంకార మమకార రూపమయిన అవిద్యయున్ను, అనగా ఆత్మకాని దానియందు ఆత్మబుద్ధియును, ఆత్మనికాని దానియందు ఆత్మదియను బుద్ధియును, ఈరెండింటినే అవిద్యయని వ్యవహరింతురు-

౨. అవిద్యవల్ల పుట్టు రాగద్వేషములున్ను ౩ రాగద్వేషములను పట్టిమనోవాకాయములచేతను చేయుపుణ్యపాప రూపకర్మములును, ౪ ఆకర్మఫలములైన సుఖదుఃఖములను అనుభవించుటకు పరిగ్రహించెడి దేవతిర్యక్ మనుష్య స్థావరాదినానావిధములయిన శరీరములున్ను, ౫ ఆశరీరములతో అనుభవించు ఆధ్యాత్మికాది దుఃఖ పరంపరలుతో మొదలుగాగలవి- ఇష్టములనగా మోక్షవిరోధులగు

పుణ్యపాపములను విడుచుటయును, ౨ ఆత్మ హృదయములోనుండి మూర్ధన్యనాడీ ద్వారా వెళ్లెడు మార్గముయొక్క ప్రకాశమున్ను తె హృదయగుహలో నుండి బయలు వెడలుటయును. ౩ అర్చిరాది లోకములయందు కలుగు సత్కారమును, అర్చిరాది లోకములనగా, అర్చిషమేవాభిసంభవంతి, అర్చిషో౽హః। అహ్న ఆపూర్యమాణ పక్షం। ఆపూర్యమాణ పక్షాద్యాన్ షడుదఙ్ఙేతి మాసాన్; మాసేభ్యస్సంవత్సరం సంవత్సరాదాదిత్యం, ఆదిత్యాచ్చంద్రమసం, చంద్రమసో, విద్యుతం, తత్పురుషో అమానవః। స ఏనాన్ బ్రహ్మగమయతి। ఇత్యేవ దేవయానః పంథా। అని ఛాందోగ్య ఉపనిషత్తు పంచమ ప్రపాఠకము, దశమఖండము, ప్రథమద్వితీయ మంత్రములలో చెప్పబడిన ముక్తపురుషుడు, పరమపదమునకు వెళ్లు మార్గమందుండు లోకములు.

ముక్తుడు హృదయములోనుండి మూర్ధన్యనాడీ మార్గముగా బయలువెడలి అర్చిర్లోకమును, దినలోకమును, శుక్లపక్షలోకమును, సూర్యుడు ఏ ఆయనమునందు ఉత్తరముగా సంచరించునో ఆ ఉత్తరాయణలోకమును, సంవత్సరలోకమును, ఆదిత్యలోకమును, చంద్రలోకమును విద్యుల్లోకమును, అమానవపురుషుని, పొంది ఆయాలోకాభిమానులచేత సత్కరింపబడి పరమపదమును పొందునని శ్రుతి తాత్పర్యము ఈ లోకములే కాక మరికొన్ని లోకములు కూడా ఈ మార్గమునందున్నట్లు శ్రుత్యంతరములయందు కనబడుచున్నవి.

౪. బ్రహ్మాండమునకు చుట్టికొనియున్న సలిల, దహన, పవనాది సప్తావరణములను దాటుటయును

౫. సత్త్వరజస్తమోగుణాత్మకమైన మూలప్రకృతిని దాటుటయును

౬. విరజానదిలో స్నానము చేయుటయున్ను

౭. సూక్ష్మశరీరమును విడుచుటయును

౮. అమానవకరస్పర్శమును లభించుటయును.

౧౦. "అపహతపాప్మా, విజరో, విమృత్యుః", విశోకో, విజిఘత్సో, అపిపాసః, సత్యకామః, సత్యసంకల్పః, ఇత్యాది శ్రుతులయందు చెప్పబడిన అష్ట గుణములతో గూడిన ఆత్మస్వరూపము ఆవిర్భవించుటయును.

౧౧. పంచోపనిషన్మయమైన దివ్య దేహమును పొందుటయును-

౧౨- ఐరమ్మదీయమను అమృత తటాకమునకు వెళ్లుటయును

౧౩. తం పంచశతాన్యప్సరసాం ప్రతిధావంతి, అనుశ్రుతిలో చెప్పిన ప్రకారముగా అయిదువందల అప్సరస్త్రీలచేత ఎదురుకొనబడుటయును-

౧౪- ఈశ్వరునితో సమానముగా వారివల్ల అలంకరింపబడుటయును-

౧౫- బ్రహ్మతేజస్సును పొందుటయును-

౧౬- దివ్యగోపురములోనికి వెళ్లుటయును-

౧౭- నిత్యసూరులచేత అక్కడ నెదుర్కొనబడుటయును-

౧౮- రాజమార్గము వెంబడిని బైలువెడలి వెళ్లుటయును-

౧౯- ఈశ్వర గృహమందు ప్రవేశించుటయును-

౨౦- అక్కడనున్న దివ్యమంటపము మీదికి వెళ్లుటయును-

౨౧- కౌషీతకీ ఉపనిషత్తుయందు పర్యంక విద్యలో చెప్పబడిన ప్రకారముగా వేంచేసి యున్న దివ్యశేషపర్యంకమును అనగా శేషపాన్పును సేవించుటయును-

౨౨- సపత్నీకుడయిన సర్వేశ్వరుని సేవించుటయును-

౨౩- వారిసన్నిధికి వెళ్లుటయును-

౨౪- ఈశ్వర పాద పీఠము మీదికి ఎక్కి తరువాత పర్యంకము మీదికి ఎక్కి స్వామియొక్క తొడపైని కూర్చుండుటయును-

౨౫- అనోన్య వీక్షణమును-

౨౬- అనోన్య సంభాషణమును-

౨౭- భగవదనుభవమును-

౨౮- అనుభవమువల్ల పుట్టిన సంతోషాతిశయమును-

౨౯. ఆ సంతోషాతిశయముచేతను కైంకర్యోపయుక్తమయిన అనేక రూపములను పరిగ్రహించి, సర్వదేశ, సర్వకాల, సర్వావస్థలయందును సర్వవిధకైంకర్యములు చేయుటయును. వీటి అన్నిటిలో ఈశ్వర కైంకర్యము ప్రధానమైన ఇష్టము- తక్కినవి దీనికి అంగములు-

౩౫. శ్రీమన్నారాయణ చరణౌ- అను పదముల చేతను చెప్పబడిన ఈశ్వరునే శరణం అను పదములో ఉపాయముగా అనగా సాధనముగా చెప్పుటవల్లను చేతనుని చేతను పొందబడు ఫలమే అందుకు సాధనము కూడా, అగుచున్నది-

౩౬- శ్రీమన్, నారాయణ, చరణౌ, అను మూడు పదముల చే చెప్పబడిన శ్రియఃపతిత్వము, కళ్యాణగుణపూర్ణత్వము, దివ్యమంగళవిగ్రహవత్త్వము అనెడు ఈమూడున్ను ప్రాప్యము కనుక వీటితో కూడిన ప్రాప్యుడైన సర్వేశ్వరుని ఉపాయముగా శరణశబ్దము చెప్పుచున్నది-

౩౭. ప్రాప్యుడైన సర్వేశ్వరుని సాధనముగా చేసికొనుటకు హేతువు ఏమనగా ఈశ్వరేతరులు, ఫలసిద్ధికి ఉపాయము కాకపోవుటచేతనున్ను, ఈశ్వరపరతంత్రుడయిన తాను ఆ ఫలసిద్ధి కొరకు స్వతంత్రోపాయములు చేయుట స్వరూపవిరుద్ధమని తెలిసికొని ఉపాయశూన్యుడై యుండుటచేతనున్ను ప్రాప్యుడైన ఈశ్వరునే ఉపాయముగా చేసికొనుచున్నాడు-

౩౮- శ్రీమన్నారాయణ చరణౌ, శరణం, అని ప్రాప్యుడైన సర్వేశ్వరునే సాధకముగా చెప్పినదానివల్ల ప్రాప్యుడయిన ఈశ్వరునికంటె వేరుగానుండు కర్మ, జ్ఞాన భక్త్యాద్యుపాయములకంటె, ఈ యుపాయము మిగుల విలక్షణమైనదని చెప్పబడుచున్నది-

౩౯. ఇట్టిమైన ప్రపద్యే, అనుక్రియాపదమున కర్థము చె

స్పష్టము-

ప్రపద్యే అను పదము, పదగతౌ అను ధాతువువలన సిద్ధించినది కాబట్టి గతిని చెప్పుచున్నది-

ఇది ఉత్తమ పురుష కాబట్టి పొందుచున్నాను- అనగా ఆశ్రయించుచున్నాను అని అర్థము-

౪౦- ఈ పదము, మానస, వాచిక, కాయికరూపమైన త్రివిధ గతినిన్ని చెప్పతగినదైనప్పటికి ఇక్కడ మానసికమే ముఖ్యము ఎందుచేతననగా నీవే రక్షించుము అని నోటితో ప్రార్థించుట యనే వాచికప్రపత్తి జేసినప్పటికిన్ని రక్షకుడున్న స్థానమునకు వెళ్లి అంజలి చేయుట మొదలయిన కాయిక ప్రపత్తి చేసినప్పటికిన్ని ఫలసిద్ధికి లోపము లేకపోయినను భారతాదులయందు అధ్యవసాయరూపమయిన జ్ఞానముచేతనే మోక్షము అని చెప్పబడుటచేతను మానసికాధ్యవసాయ రూపమైన ప్రపత్తియే ముఖ్యము- ఈ అధ్యవసాయమనునది అనన్యార్హ శేషత్వ జ్ఞానానంతరమందు పుట్టే కర్మజ్ఞానాది సాధనములకంటె విలక్షణమైనదై, దేవతలకు కూడా తెలియశక్యము కానిదై, భగవంతుని రక్షకత్వానుమతిరూపమై అనగా భగవంతుడు రక్షించే రక్షణమునకు ఒప్పుదల అయి ఒక్కపర్యాయము ఆచరింపవలసినదై ఫలమును తప్పకుండా శీఘ్రముగా నిచ్చేది అయి వర్ణాశ్రమాది నియమము లేకుండా అందరిచేతను అవలంబింపతగినదై, పరతంత్రమైన ఆత్మస్వరూపమునకు విరుద్ధము కానిదై, దేశ, కాలాది నియమములు లేనిదై మరణ సమయమందు ఈశ్వరుని యందు స్మృతియుండుటనే గాని వల్లకాదనే నియమము లేనిదై బహుసులభమైనదై, దృఢాధ్యవసాయరూపమైయుండు జ్ఞానవిశేషము-

౪౧- చేతనునికి అపేక్షితమైనఫలసిద్ధికి ఉపాయము ఆశ్రయింపబడు ఈశ్వరుడే అగుటచేతనున్ను కరణత్రయము చేతను ఆశ్రయించు ఆశ్రయణములు నామతః ఉపాయములుగాని సాక్షాత్తు ఉపాయములు కాకపోవుటచేతనున్ను ఈకరణత్రయమున్ను

ఉండవలెననే నిర్బంధము లేదు, కరణత్రయముచేతనైన ప్రపత్తి యుండినను ఉండవచ్చును ఫలసిద్ధికిమాత్రము ఏక కరణ ప్రపత్తియే చాలును ఈశ్వరుని యొక్క ఉపాయపూర్తికి శ్రియఃపతిత్వమున్ను, వాత్సల్యాది గుణములున్ను, దివ్యమంగళ విగ్రహమున్ను అపేక్షితములైనట్లు అధికారిపూర్తికి కరణత్రయము ఉండవలయును.

౪౨. భూతభవిష్యద్వర్తమానములైన క్రియలతో చెప్పక ప్రపద్యే అని వర్తమానార్థక క్రియాపదముతో ప్రపత్తిని చెప్పుటకు హేతువు ఏమనగా ప్రపత్తి ఒక్క పర్యాయమే చేయవలసినదని పాంచరాత్రమందు చెప్పబడుట చేతనున్ను ఆప్రపత్తిని చేసిన తరువాత ఈ చేతనుడు ప్రకృతివశ్యుడై అజ్ఞానముచేతను నిషిద్ధ కార్యములను చేయుచున్నను పశ్చాత్తాపము పుట్టి ప్రాయశ్చిత్తము చేసికొనవలెననే ఉద్దేశము కలిగినయెడల ఈప్రపత్తియే తప్ప ప్రాయశ్చిత్తము వేరే లేకపోవుట చేతనున్ను, ఆప్రపత్తి రెండవ పర్యాయము చేయకూడదు గనుకనున్ను, పూర్వము చేసిన ప్రపత్తినే స్మరించుకొనుటకై వర్తమాన క్రియతో చెప్పబడినది.

౪౩. పూర్వవాసన చేతను ఇతర జ్ఞానాది రూపమయిన స్వతంత్రోపాయములయందు మనస్సు వెళ్లకపోవుటకున్ను ఈ ద్వయానుసంధానముతో తప్ప కాలము వెళ్లింపశక్యము కాకపోవుట చేతను కాలము గడుపుటకున్ను, దీనియందుండెడు భోగ్యతనుపట్టి దీనిని విడువ శక్యము కాకపోవుట చేతనున్ను, ఈ వర్తమానార్థక క్రియ ప్రయోగింపబడినది.

౪౪. ఈ వర్తమాన క్రియయుండుటకు క్రింద చెప్పిన హేతువులంగీకరింపక అనేక పర్యాయములు అనుసంధించితేనే తప్ప ఫలసిద్ధికాదు గనుక ఆవృత్తినిమిత్తమై ఈ వర్తమాన క్రియయున్నదని తలచినపక్షమునకు ప్రథమము చేసినప్రపత్తియందు ఇంద్రజిత్తుక బ్రహ్మాస్త్రమువలె విశ్వాసము లేనివాడగుచున్నాడు. అందువల్ల సిద్ధోపాయము ఫలింపక జారిపోవును। ఎట్లంటె

౪౯- నీకు ప్రార్థించు కైంకర్య ప్రార్థన యనునది సర్వజ్ఞుడయిన సర్వేశ్వరుడు ఎఱుగకను కాదు- రోగగ్రస్తుడయిన పుత్రుడు అన్నమందు వాంఛలేక కొంతకాలము పడియుండి ఔషధముల చేతను ఆరోగము తీరి ఆకలిపుట్టి తల్లిని అన్నము అడిగితే ఆ పలుకు తల్లికి ఎంత ఆహ్లాదకరముగానుండునో, అనాదికాలము నుండివిషయాంతరాసక్తియనే రోగముచే గ్రస్తుడై, భోగ్యమైన, భగవత్కైంకర్యమందు వాంఛలేక పడియున్న చేతనుడు ఆచార్యోపదేశరూపమైన ఔషధముల చేతను ఆ వ్యాధి శాంతించి కైంకర్యమందు రుచిపుట్టి దానిని గురించి ప్రార్థించితే ఈశ్వరునకు అంత సంతోషముపుట్టును అది హేతువుననే ఈ ప్రార్థన అవశ్యకము-

౫౦- శ్రీమతే అను పదమందు పూర్వవాక్యములో చెప్పబడిన వ్యాప్తిద్వయమున్ను ఈశ్వరునికిన్ని పిరాటికిన్ని ఉండు నిత్యయోగమున్ను చెప్పబడుచున్నవి-

౫౧- ఈ పదమునకు, పెరియ పిరాట్టితో కూడియున్న వాని కొరకు అని అర్థము-

౫౨- ఈశ్వరుడు చేతనునకు ఫలసాధనమైనప్పుడు ఈమెతాముకూడా ఉపాయము కాకుండా పురుషకారమైయుండి ఆయన ప్రాప్యుడైనప్పుడు తానున్ను ప్రాప్యురాలగుటకున్ను, వీరు చేయు కైంకర్యమును స్వామికి భోగ్యమగునట్లు చేయుటకున్ను తనకు ధారకమైన భగవదనుభవము కొరకున్ను, ఆయనతో సర్వదా కలిసియుండు ఉనికిని ఈ శ్రీమత్పదము చెప్పుచున్నది-

౫౩- కైంకర్యమును ప్రతిపాదించుచున్న తిరుమంత్రమందలి నారాయణ పదమునకు ఉత్తరవాక్యమైన శ్రీమతేనారాయణాయనమః అనునది వివరణముగు చున్నది. ఎట్లంటే తిరుమంత్రమందలి నారాయణ పదము, నారాయణునికే కైంకర్యము చేయవలయునని మాత్రము చెప్పుచున్నది-

ఈ ఉత్తర వాక్యములో కైంకర్యము తిరువుళ్ళ పట్టువాడు లక్ష్మీవిశిష్టుడు కావలెనన్ని కైంకర్యమును చేయువాడు, ఆ

హేతువుపమనగా, శేషికిసంతోషమును పుట్టింపని వస్తువునకు శేషత్వము లేకపోవును గనుక ఆ శేషిసంతోషము నిమిత్తమై తాను చేయువ్యాపార విశేషములచేతను తన శేషత్వస్వరూపలాభమున్ను, శేషియొక్క ముఖోల్లాసమును తాననుభవించడమనెడు ప్రాప్యలాభమున్ను కావలసియున్నది- గనుక ఈ కైంకర్యము నిత్యప్రార్థనీయ మయ్యేయుండును-

౬౫- ఇటువంటి నమః అను పదమునకు అర్థము చెప్పబడును- నమః, అనగా, మః, న, నాకు కాదు, అని అర్థము, దీనివల్ల అహంకార, మమకార నివృత్తి చేయబడుచున్నది-

౬౬- ఈ నమః పదము సామాన్యముగా అహంకార మమకార నివృత్తిని చెప్పుటచేతను, తిరుమంత్రములోని నమః పదమువలెనే స్వరూపోపాయ పురుషార్థముల యందలి విరోధులను మూడింటిని తీసివేయ తగినదైనప్పటికీ ఈస్థలమందు కైంకర్యవిరోధులను మాత్రమే తీసివేయుచున్నది- తక్కినవాటిని తీసివేయవలె లేదు. అవి యింతకు పూర్వమే నివర్తించి పోయినవి-

౬౭- కైంకర్యమునకు విరోధియేదనగా-

కైంకర్యము తనకొరకై అనగా స్వప్రయోజనమై చేయుటయున్ను, మదీయత్వ బుద్ధితో చేయుటయును ఈ రెండును కైంకర్య విరోధులు-

౬౮- అహంకార, మమకార, నివృత్తిని ప్రార్థించుచున్న ఈ నమః పదమందు, దేహాత్మాభిమాన, స్వాతంత్ర్యాభిమానములకు మూలమైన అవిద్యయున్ను, దానివల్ల పుట్టు పుణ్యపాపరూపకర్మములున్ను, కర్మవల్ల కలుగు దేహసంబంధమున్ను, ఈ సమస్త విరోధులున్ను పోగొట్టబడుచున్నవి-

భాష్యకారులవారు గద్యత్రయములో నమః పదార్థమును వివరించినపుడు మూడు మాటల చేతను- అవిద్య, కర్మ, దేహసంబంధ నివృత్తులనే ప్రార్థించినారు-

౬౯- ఈ చేతనుడు కైంకర్యము చేయునపుడు ఉండవలసిన ప్రా

కాకమెట్లనగా-

చూడికొడుత్త నాచ్చియారు కృష్ణునియందు భక్తి అతిశయించి తదేక భావనచే తనను ఒక గోపికగా భావించుకొని గోపికలు ప్రార్థించిన ప్రకారముగా తాను కైంకర్యము ప్రార్థించు సమయమందు కేవలను మా సంతోషమునకు హేతువయినటువంటిన్ని మన ఉభయుల సంతోషమునకు హేతువైనటువంటిన్ని కైంకర్యము, చేయుటగాక కేవల నీ సంతోషమునకే హేతువయిన కైంకర్యమును చేతుము అనిన ప్రకారముగా శేషికే ఉపయుక్తమైన కైంకర్యమును చేయవలయును-

ఇందువలన ఈ నమః పదమునకు స్వప్రయోజన నివృత్తి ప్రార్థనమే ప్రధానార్థముగా కనబడుచున్నది.

౭౦- భగవత్కైంకర్యమునకు విరోధులెవ్వరలో చెప్పబడిన?-

విఘ్నము లిటుపైని చెప్పబడును-

ఈశ్వరునియొక్క దివ్యమంగళ విగ్రహ సౌందర్యమున్ను చేతనులయొక్క దృష్టి చిత్తములను అపహరించివేసి వారు చేయు కైంకర్యమును మరపించే దగుటచేతను కైంకర్యమునకు అదియును విఘ్నమే.

ఈ నమః పదమునకు పూర్వమందున్న చతుర్థీ విభక్తియందు చెప్పబడిన కైంకర్యమున్ను, అహంకార మమకార నివృత్తి పూర్వమందు చెప్పబడినది కాబట్టి స్వప్రీతికి ఉపయుక్తమగుట చేతను ఈశ్వర ముఖవికాసమే ప్రయోజనముగా గలవారలకు విఘ్నకరమే.

౭౧- నారాయణాయ అను చతుర్థ్యంతము చెప్పబడుచున్న కైంకర్యప్రార్థన నిత్యప్రార్థనీయమయినట్లు ఈ నమః పదమందు చెప్పబడుచున్న కైంకర్య విరోధి నివృత్తి ప్రార్థనయును, ఈ లీలావిభూతియందున్ను, నిత్యవిభూతియందున్ను సర్వదా యుండవలెను.

## ద్వయప్రకరణము-

౭౩- చేతనుడు అహంకార మమకారములకు స్థానమయిన ఈ దేహముతో కూడియున్నప్పుడుగదా స్వభోక్తృత్వము మొదలయిన కైంకర్యవిరోధులు పోవలెనని కోరవలసినది- సకలదోషములున్ను నివర్తించి ముక్తదేహమును పొంది పరమపదమునకు వెళ్లి ఈశ్వర కైంకర్యము చేయు దశయందున్ను వానికి విరోధియయిన స్వభోక్తృత్వబుద్ధి యుండునా- అంటే పరమపదమందు శేషభూత కైంకర్య దశయందున్ను ఈశ్వర స్వరూప రూపగుణములయొక్క అనుభవమువల్ల ఒక విధమయిన ఆనందము కలుగును అందువలన స్వభోక్తృత్వబుద్ధి పుట్టును కాబట్టి పరమపదమందున్ను స్వభోక్తృత్వబుద్ధి రూప విరోధి నివృత్తి ప్రార్థన అవశ్యకము, ఆ హేతువుచేతనే సిరుగాద్యనుభవము చేత మాకు కలిగెడు ఆనందమంతయు స్వభోక్తృత్వ బుద్ధి పుట్టి అందువల్ల స్వరూపము నశింపకుండా దానిని శాంతింపజేయు ఔషధమయిన వాడా అని ఆ భోక్తృత్వ బుద్ధికి ఈశ్వరునే ఔషధముగా నిత్యముక్తులు ప్రార్థించినట్లు ఆళ్వార్లు పాయించి యున్నారు- కైంకర్యముచేయుదశయందు స్వభోక్తృత్వ బుద్ధి పుట్టి దానినిపోగొట్టుకొనుటకై నమః పదము ముక్తులు అనుసంధించుచునే యుందురని చెప్పబడుచున్నది-

ఈ ద్వయమంత్రమందు బాహుళ్యముగా చెప్పబడు అర్థములు సంగ్రహముగా చెప్పబడుచున్నవి-

శ్రీశబ్దముచేత పిరాట్టియొక్క పురుషకారత్వమున్ను మత్ అను మతుపుచేతను, ఉభయులయొక్క నిత్యయోగమున్ను, అనగా ఉభయులు ఎల్లప్పుడు కలిసియుండుటయున్ను, నారాయణ శబ్దముచేత, ఆశ్రిత సౌకర్యాపాదకమైన వాత్సల్యాదిగుణములున్ను, చరణ, శబ్దముచేత దివ్యమంగళవిగ్రహమున్ను, శరణ, శబ్దముచేత, ఈగుణవిగ్రహాదులతో కూడియున్న శ్రీమన్నారాయణునియొక్క ఉపాయత్వమున్ను; ప్రపద్యే, అను క్రియాపదముచేతను అధ్యవసాయరూపమైన ఉపాయస్వీకారమున్ను; శ్రీ

మతే అనుపదముచేతను ఉపాయఫలమైన కైంకర్యప్రతిసంబంధియు
గ మిథునమనేదిన్ని, నారాయణపదముచేత, సర్వశేషిత్వమున్ను,
చతుర్థిచేత కైంకర్యప్రార్థనయున్ను, నమః పదముచేత, కైం
కర్య విరోధి నివృత్తియున్ను చెప్పబడుచున్నది.



శ్రీమతే రామానుజాయ నమః

## చరమశ్లోక ప్రకరణమ్.

మహారహస్యమైన ద్వయమంత్రములో పూర్వవాక్యమందు చెప్పబడుచున్న సిద్ధోపాయ స్వీకారముయొక్క ఈశ్వరాభిమతత్వమున్ను ఈసిద్ధోపాయమునకు ఆవశ్యకమైనది. సాధనాంతర పరిత్యాగమున్ను చేతనునిచేతను స్వీకరింపబడు ఈసిద్ధోపాయమన్యనిరపేక్షయను ఉపాయత్వమున్ను ఈచరమశ్లోకమందలి పూర్వార్థమయిన సర్వధర్మాన్ పరిత్యజ్య, మామేకం శరణం వ్రజ అనుదానిచే ప్రతిపాదింపబడుచున్నవి, ద్వయముయొక్క ఉత్తరవాక్యమందు చెప్పబడుచున్న కైంకర్యరూపఫల ప్రాప్తికిముందు కలుగవలసిన సకలపాప నివృత్తియున్ను ఈచరమశ్లోకమందలి ఉత్తరార్థమైన అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః అనుదానిచే ప్రతిపాదింపబడుచున్నది- కాబట్టి ఈచరమశ్లోకము ద్వయమునకు వివరణముగుచున్నది ఇట్టిదైన పంచమవేదసారమగు భగవద్గీతలకు ముఖ్యతాత్పర్యమైన ఈచరమశ్లోకమునకు అర్థము విశదముగా చెప్పబడును-

అతిరహస్యమయిన ఈ చరమశ్లోకమును తెలిసికొనటకయే భాష్యకారులువారు పద్దెనిమిది మారులు శ్రీరంగమునుండి తిరుక్కోట్టియూరునకు వేంచేసిరి. ... తిరుక్కోట్టియూరునంబిగారిసన్నిధికి వేంచేసియుండిరి, ఆనంబిగారు ఈ అర్థముయొక్క గౌరవమునున్ను ఇందుకు తగిన అధికారులు సామాన్యముగా లేకపోవుటచేతనున్ను, భాష్యకారులువారియొక్క ఆస్తిక్యమునన్ను ఆదరమునున్ను పరీక్షించి చెపుదామనే తాత్పర్యముకలవారై పదినేను పర్యాయములు త్రిప్పి, పద్దెనిమిదవ పర్యాయము అన్యులకు చెప్పవని ప్రమాణముచేయించుకొని మాసోపవాసము చేయించి తరువాత ఉపదేశించిరి-

ఈచరమశ్లోకముయొక్క అర్థశ్రవణమునకున్ను అనుష్ఠాన

కాయక్లేశ రూపములగుటచేతనున్ను, జ్ఞానము ఇంద్రియజయ పూర్వకముగా చేయవలసిన దగుటచేతనున్ను భక్తి చిరకాలసాధ్యమయినదగుటచేతనున్ను వాటిని చేయశక్యము కాదని ముముక్షువు భయపడి ఊహించినను ఈశ్వరునికి అత్యంత పరతంత్రమైన ఆత్మస్వరూపమునకు ఈ స్వతంత్రోపాయములు విరుద్ధములని యున్న ఆలోచించి, వీటిచేతను ముక్తి కలుగదనియును ఇటుపయిని ఏమి చేయవలసినదే అని యును దుఃఖించుచున్న ఈ అర్జునుని శోకనివృత్తి కొరకు, సులభముగా చేయతగినట్టియును, స్వరూపానురూపమైనట్టియును ఇంతకు తప్ప వేరే సాధనము లేదనతగినట్టి చరమ సాధనమును చెప్పుటచేతను ఈ శ్లోకము చరమశ్లోకమనబడును.

చరమార్థ ప్రతిపాదకమగుటచేతనే చరమశ్లోకమనబడును గాని గ్రంథముయొక్క అంతమందు ఈశ్లోకము చెప్పబడినందువల్ల కాదు, దీని వెనక కూడా కొన్ని శ్లోకములున్నవి.

౧- ఈశ్లోకముయొక్క పూర్వార్ధము చేతను ఉపాయస్వీకారము చేయు చేతనునియొక్క కృత్యము చెప్పబడుచున్నది. ఉత్తరార్ధము చేతను ఉపాయభూతుడైన ఈశ్వరునియొక్క కృత్యము చెప్పబడుచున్నది.

౩- చేతనుడిప్పుడు చేయవలసిన కృత్యము సిద్ధోపాయపరిగ్రహము అనగా తనరక్షణమునకు ఈశ్వరుడే సాధనమని నమ్మియుండుట.

౪- మామేకం శరణం వ్రజ అను వాక్యముచేతను సిద్ధోపాయ స్వీకారమాత్రమును చెప్పక సర్వధర్మాన్ పరిత్యజ్య అను వాక్యము చేతను సర్వధర్మ పరిత్యాగమును కూడా చెప్పుటకు హేతువు ఏమనగా-

సిద్ధోపాయమునకు ఈసాధనాన్తర పరిత్యాగము అంగము లేనప్పుడు స్వరూపసిద్ధి లేకపోవుటవలన సాంగముగా చెప్పుచున్నది.

ప్రత్యాఖ్యపాహి వాచామేత్, స్నాత్వా విధివదచ్యుతమ్, స్థిత్వా ప్రణమ్యం ధ్యానవేదకాన్యాత్, ధ్యాత్వా ధ్యేయం జపేన్మంత్రం, ౹

ద్యోపాయములను ఆచరించుటకు యోగ్యతను కలిగించునట్టి సంధ్యా వందన, పంచమహాయజ్ఞాది రూపమయిన నిత్యనైమిత్తికాది కర్మములు చెప్పబడును. పంచమహాయజ్ఞములనగా, దేవయజ్ఞ, భూతయజ్ఞ, పితృయజ్ఞ, మనుష్యయజ్ఞ, బ్రహ్మయజ్ఞములు.

౧౪. ఈ సర్వధర్మాన్, అను పదమునకు శ్రుతిస్మృతులయందు విధింపబడిన ఏ నిత్యనైమిత్తికాది రూపములయిన కర్మయోగాద్యుపాయములను అని అర్థము.

ఇదంకురు, అను చోదనారూపమయిన విధివాక్యము ప్రమాణముగాగల అర్థము ధర్మమని చెప్పబడును.

ఇదం, దీనిని; కురు, చేయుము, అను శ్రుతికి అర్థము, చోదన అనగా ప్రేరణ.

౧౫. ఈ కర్మజ్ఞానాదులనెడు స్వతంత్రోపాయములు భగవదత్యంత పరతంత్రమయిన ఆత్మస్వరూపమునకు విరోధులగుటచేతను వీటిని, అధర్మ అని అధర్మశబ్దముచేతను చెప్పవలసి యుండగా ధర్మశబ్దముచేతను చెప్పుటకు హేతువేమనగా అర్జునుడు స్వధర్మమైన యుద్ధమును అధర్మముగానున్ను అధర్మములైన వీటిని ధర్మములనుగానున్ను భ్రమించి యుండుటచేతను.

౧౬. పరిత్యజ్య, అను అవ్యయపదమునకు విడిచిపెట్టి అని అర్థము.

౧౭. ఈ పరిత్యజ్య, అను పదమందు, త్యాగశబ్దమున్ను ల్యప్ప్రత్యయమున్ను, పరి అను ఉపసర్గమున్ను, కలవు. త్యాగశబ్దార్థము ముందుచెప్పబడును.

ఇచ్చట చెప్పబడిన త్యాగమనునది కేవలము ఒకచోట మాత్రము కాదు. ముత్యపుచిప్పను చూచి వెండియని భ్రమను పొందినవాడు వదలున్ను తనకు ప్రయోజనమున్న ఒకదిక్కునకు వెళ్లవలెనని ఉద్దేశించి అదిగో అను భ్రమతో మరియొక దిక్కునకు వెళ్లినవాడున్నదానన్ను ఈశ్వరప్రాప్తి సాధనములను కోరుచున్న

సాధనముగా శాస్త్రమందు చెప్పబడియున్న సర్వధర్మములను వి
డిచి తనను ఆశ్రయించుమని చెప్పుటచేతను అవి ఆభాసధర్మములు
గాని సాక్షాత్ ధర్మములు కావనియును స్థాపింపతగిన సాధ్యధ
ర్మము తానే అనియును చెప్పబడెను.

౩౨. ఇట్లు చెప్పుటచేతను విడువబడిన కర్మజ్ఞానాదిసాధన
ములకంటె ఈ సిద్ధసాధనమునకు అతిశయము చెప్పబడినది.

౩౩. కర్మజ్ఞానాది సాధనములకంటె, దీనికి అతిశయము
ఏది అనగా చేతనుడు చేయు వ్యాపారములచే స్వరూపసిద్ధి కలిగి
యుండక కర్మజ్ఞానాదులవలెగాక స్వతస్సిద్ధమై, వాటివలెనే అచేత
నములై యుండక పరమచేతనమై, అశక్తములవలెగాక సర్వశక్తమై, అ
పాయములు కలదిగాక, నిరపాయమై, పరతంత్రమైన ఆత్మ
స్వరూపమునకు ప్రాప్తములై యుండక ప్రాప్తమై, అనగా స్వరూపా
నురూపమై మరియొక సహాయమును అపేక్షింపనిదై యుండుట.

౩౪. ఉపాయాంతరములు, చేతనవ్యాపారముచేతను సాధింప
బడునవి యగుటచేతను తమయొక్క స్వరూపసిద్ధియందు చేతనసాపే
క్షములై యుండుటను, చేతనునికి ఫలమునిచ్చుటయందు ఈశ్వరుని
జ్ఞానము శక్తియు లేక అచేతనములై అశక్తములయి యుండుటచేత
ను ఈశ్వరసాపేక్షములై యుండును. ఈ సిద్ధోపాయము అటుల
గాక నిరుపమ పరమ చేతనము సర్వశక్తియు అగుటచేతను ఉపా
యాంతరములకు ప్రతిభటమై అన్యనిరపేక్షమై యుండును.

౩౫. మామ్ అను పదమందు అర్జునునియొక్క దోష
ములను ఆలోచింపక తత్త్వోపదేశము మొదలుగాని కావలసిన అర్థ
ములను ఉపదేశించుటచేతను వాత్సల్యగుణమును, తనయొక్క ప
రత్వమును విశ్వరూప సందర్శనము మొదలైనవాటిచేతను సా
క్షాత్కరింపజేయుటవల్ల స్వామిత్వమును, హే కృష్ణ హే
యాదవ హే సఖ అని అర్జునుడు తనను మిత్రునిగా తలచి పిల
చినట్లు ఆతనితో కలిసి మెలసియుండుటచేతను సౌశీల్యమును, కం
టికి గోచరత్వము కాని అప్రాకృత దివ్యమంగళ విగ్రహమును

కంటితో చూడతగినట్లుగా చేయుటచేతను సౌలభ్యముస్ఫుటముగా ప్రకాశించుచున్నవి.

౩౬. సుగ్రీవములను తోలుటకు హస్తమందు ధరించినవేత్రమును అనగా కొరడాయును ఎటువైపు వలసిన అటువైపు త్రిప్పుటకును నిలుపవలసినస్థలమందు నిలుపుటకును పట్టుకొన్నలగాములును, తలయందుకిరీటము మొదలైన ఆచ్ఛాదనము లేకపోవుటచేతను సేనాధూళిచేత కప్పబడ్డ శిరోజములును రథమునక్రిందుగావ్రేలవేసిన శ్రీపాదములును కలవాడైనిలిచియున్న సారథ్యవేషమును, మామ్. అనిశనపరుచుచున్నాడు.

౩౭. ఏకమ్, అనుపదమునకు అర్థము చెప్పబడును.

౩౮. ఈ ఏకశబ్దము స్థానప్రమాణముచేతను ఏవకారార్థము చెప్పును, స్థానప్రమాణమనగా ఏకశబ్దస్థానమందు ఏవకారము ప్రయోగింపబడియుండుట అనగా ప్రపత్తిని చెప్పుస్థలములయందు ఏవకారముండుటచేతను, ఆఏవకారస్థానమందు ఇచ్చట ఏకశబ్దముండుటచేతను, ఈఏకశబ్దమునకును ఏవకారార్థమే చెప్పబడును.

౩౯. మామేవయే ప్రపద్యన్తే, నన్నే ఎవరుప్రపత్తిచేయుచున్నారో తమేవచాద్యం పురుషం ప్రపద్యే, కారణుడైన ఆపురుషునే ప్రపత్తిచేయుచున్నాను. త్వమే వోపాయభూతో మే భవ, నీవేనాకు ఉపాయభూతుడవుకమ్ము, అతెనక్కు నిన్ పాదమే శరణాగత్తైమొళిన్దాయ్ నీప్రాప్తికి ఉపాయము ఉపదేశించుసమయమందు నీపాదములనే ఉపాయముగా ఉపదేశించినావు, ఇత్యాదులయందువలెనే, మామేకం అనే ఈస్థలమందును నన్నే అని ఏవకారార్థమునే చెప్పవలయును.

౪౦. ఏవకారార్థమును చెప్పు ఈఏకశబ్దముచేతను వ్రజ అనుపదమందు చెప్పబడుచున్న అధ్యవసాయరూపమయిన సిద్ధోపాయస్వీకారమందలి ఉపాయత్వముతీసివేయబడుచున్నది. అనగా నీవేనాకు ఉపాయముకావలెనని భగవత్సన్నిధియందు చే

తనకు తాచేయు ఉపాయస్వీకారము వాడిచ్చు ఫలమునకు ఉపాయము కాదు. ఆ ఈశ్వరుడే ఉపాయము అని వీడు చేయు స్వీకారమందలి ఉపాయత్వమును తీసివేయుచున్నది.

౪౧. ఈ సిద్ధోపాయానన్తరమందే ఫలము సిద్ధించుట చేతను స్వీకారము లేనప్పుడు ఫలము సిద్ధింపక పోవుటచేతను ఈ స్వీకారము ఫలసిద్ధికి అవశ్యముండవలసి యుండగా ఇట్టి స్వీకారమందు ఉపాయత్వము ఎట్లు తీసివేయబడును. అంటే ఈ స్వీకారానంతరమందు చేతనునికి కలుగబోవు ఫలసిద్ధి ఉపాయభూతుడైన ఈశ్వరుని చేత సిద్ధించినట్లే ఈ స్వీకారమున్నూ వానిచేతనే సిద్ధించును. ఇందువల్ల ఈ స్వీకారము ఉపాయభూతుడైన ఈశ్వరునివల్ల పుట్టినదిగాని సాక్షాత్ ఉపాయము కాదు.

౪౨. ఈ సిద్ధోపాయభూతుడయిన ఈశ్వరునివల్ల ఈ ఉపాయ స్వీకారము పుట్టుటయనగా ఈ చేతనులు కరణకళేబరములు లేక అందువల్లనే భోగమోక్షములను చెడి, అచిత్ప్రాయులై పడియున్న దశయందు, కరణకళేబరములనిచ్చి, జ్ఞానవికాసమును కలుగజేసి, తానును అనేక అవతారములను అవతరించి, ఆశ్రయణరుచి, విశ్వాసములను పుట్టింపతగిన తన కళ్యాణగుణ చేష్టితములను ప్రకాశింపజేసి ఈవిధముగా వాడు చేసిన కృషిచే ఫలించినదనుట.

౪౩. జ్ఞానాధికులయిన నిత్యసూరులకు నిర్వాహకుడైన సర్వేశ్వరుని కటాక్షము ప్రసరించి దానివల్ల వానిని పొందుటకై వానిని జ్ఞానవంతులు చేసుకొన్నాను. అనగా వానినే ఫలసాధనముగా చేసికొనినాను. అని నమ్మాళ్వార్లు భగవల్లాభమునకై సిద్ధోపాయము స్వీకరించినానని పాడుచు ఆ సిద్ధోపాయస్వీకారమును వాని నిర్హేతుకకృపచేతనే నాకు కలిగినది అని పాడినందువల్ల ఈ స్వీకారము ఈశ్వరుని యొక్క కృషిఫలమనియే గ్రహింపవలయును.

౪౪. చేతనునకు సిద్ధోపాయ స్వీకారమందు రుచిపుట్టుటకు కృషిచేయువాడున్ను ఈశ్వరుడే అందువల్ల ఈ చేతనులు సిద్ధో

పాయస్వీకారముచేసిన మాత్రముచేత ఫలమిచ్చునని యును, అది లేకపోయినప్పుడు ఇయ్యకయుండుననియు తలంపక ఆత్మోజ్జీవనమునకే సర్వదా యత్నించు సర్వేశ్వరుడు మనయొక్క ఇష్టప్రాప్తి, అనిష్టనివారణ, రూపమయిన ఫలమును కలుగుచేయువాడని ప్రతిపత్తి కలిగియుండవలయును.

౭౫. ఈసిద్ధోపాయ స్వీకారముచేయకపోయినను చేతనుల యొక్క కార్యములను ఈశ్వరుడుచేయునని తలపక ఈసిద్ధోపాయస్వీకారమున్ను అవశ్యము కార్యసిద్ధికి ఉండవలెనని తలచినయెడల ఉపాయభూతుడయిన ఈశ్వరునియొక్క సహాయాన్తర వైరపేక్ష్యమునకు భంగము వచ్చును.

౭౬. ఈశ్వరుడు సర్వసముడగుటవలన చేతనకృత్యమును లేశమును అపేక్షింపకయే ముక్తినిచ్చునప్పుడు, అందరికిని ఒక్కసారియే ముక్తి ఇయ్యక కొందరికే ఇయ్యడమునకు హేతువు ఏమను ప్రశ్నమునకు పరిహారార్థమును, ఇంతకాలము మనలను రక్షింపని ఈశ్వరుడు నేడు రక్షించునా అను సంశయము కలుగునప్పుడు తన్నివృత్తి కొరకును, ఈసిద్ధోపాయస్వీకారము వ్యాజమైయుండును.

అన్యథా చేతనముగాక చైతన్యముకలవాడై యుండుట చేతనును భగవదేకోపాయత్వరూపమైన ఈ అధ్యవసాయము చైతన్యకార్యమయ్యేయుండును, ఉపాయము కాదు. ఈసిద్ధోపాయము, విధింపబడివచ్చినది కాదు చేతనునియొక్క రుచిని బట్టి వచ్చినది.

భగవదేకరక్ష్యత్వరూపమైన స్వరూపమునకు విరుద్ధము కాదు. అనుగుణమే, అనాదికాలమునుండి స్వయత్నము చేతను ఈశ్వరుడు చేయు రక్షణమును అంగీకరింపని చేతనుడు అంగీకరించినందుకు సూచకమును అయియుండును.

౭౭. మామ్, అనుపదమునకు పూర్వమందున్న సర్వధర్మాన్ పరిత్యజ్య అనుస్థలమందు సర్వధర్మపరిత్యాగమును చెప్పిన సర్వేశ్వరుడు తనను ఉపాయాంతరములనుపాయముగా తలపక ఒక్కతనినే ఉపాయముగా తలపుమని చెప్పెను. ఏకమ్, అనుస్థలమం

ను స్వీకారమందు ఉపాయభావమును తీసివేసి తనను ఉపాయస్వీకారము చేయువానిని ఉపాయముగా తలపక, ఒక్కతనకే ఉపాయముగా తలంపుమని చెప్పుచున్నాడు.

౪౮. నిరుపాధిక రక్షకుడైన ఈశ్వరుని రక్ష్యభూతుడైన చేతనుడు తనరక్షణమున కుపయుక్తముగా ఆశ్రయించిన ఆశ్రయణము అనగా స్వీకరించు స్వీకారము అహంకారగర్భము, కొమారుడు తనను పోషించుటకై తండ్రిచేత వ్రాయించుకొన్నట్లుగా అవద్యకరమును అనగా నింద్యమున్ను.

౪౯. చేతనులను రక్షించుటకు సమర్థుడైన ఈశ్వరుడు రక్షించుటకు అభిమానించి పరిగ్రహించుటయను స్వీకారము ఈ చేతనులకు రక్షకము.

౫౦. సిద్ధోపాయముకన్న ఇతరములైన ఉపాయాంతరముల యొక్క స్వరూపము చేతనప్రవృత్తిరూపమైన వ్యాపారముచేతనే సిద్ధింపవలసియుండుటచేతను వాటికి ఈ చేతనునియొక్క స్వయత్ననివృత్తి దోషమై యుండును. ఈ సిద్ధోపాయము సహాయాంతరమును సహింపక పోవుటచేతను దీనికి ఈ చేతనునియొక్క ప్రవృత్తిరూపమైన వ్యాపారము దోషమైయుండును.

౫౧. నమ్మాళ్వారులు సిద్ధోపాయస్వీకారమును ఉపదేశించు సమయమందు విశేషించి వ్యాపింపనక్కరలేదు. అంగీకరించుటయే చాలును అని ఉపదేశించినందువల్ల ఈ సిద్ధోపాయ స్వీకారము చేయువారలకు ఏ వ్యాపారమును చేయనక్కరలేదు.

౫౨. క్రింద, అనగా సర్వధర్మాన్ పరిత్యజ్య అనుష్ఠమంచు ఈ చేతనులయొక్క సకలప్రవృత్తినివృత్తియును చెప్పబడెను.

౫౩. నాయొక్క దుష్టమనస్సును పోగొట్టినావు నిన్ను అనుభవించి సేవించుటకు మనస్సును ఇచ్చినావు. అని ఉపాయభూతుడైన ఈశ్వరుని విషయమై చేతనునికి కలుగు ఉపకారస్మృతియును, చైతన్యమును పట్టివచ్చినదిగనుక ఉపాయములో చేరదు.

౫౪. శరణమ్ అనుపదమునకు.

౨౫. ఉపాయముగా అని అర్థము.

౨౬. ఈ శరణశబ్దమును లక్షించువానికి, గృహీతమగు ఉపాయమును కనపరచినను ఈ స్థలమందు అనగా ఉపాయాంతరములను విడచి ఈశ్వరునే ఉపాయముగా స్వీకరించు స్థలమందు, ఉపాయమునే కనపర్చును. ఏమనుచేతనంటె సర్వోపాయములను విడచి తననే పట్టుమని చెప్పుచున్న స్థలమగుటచేతను ఉపాయమును చెప్పినచో సర్వధర్మాన్ పరిత్యజ్య అను క్రిందివాక్యముతో చేరును. ఆ లాగు చేరని పక్షమునకు ప్రకరణభంగమను దోషము వచ్చును. ప్రకరణభంగమనగా ఒక అంశమును ఉపపాదించుచు దానికి విరుద్ధమైన అంశమునుగాని దానితో సంబంధింపని అంశమునుగాని చెప్పుట.

ఈ శ్లోకమందు చెప్పబడిన సర్వధర్మపరిత్యాగము ఈశ్వరుని యొక్క ఉపాయత్వమును కనపరచుచుండగా, శరణశబ్దప్రయోగమునకు అవసరము లేదని కొందరందురు. ఉపాయాంతరత్యాగము చెప్పబడినను అది సిద్ధోపాయ స్వీకారసమయమందువలెనే ప్రాప్యసమయమందును సమానమైయున్నది. ఎందుచేతననగా ప్రాప్యసిద్ధ్యనంతరమందు ఏరు దాటినవెనుక నావతో ప్రయోజనము లేనట్లు ఉపాయాంతరములతో ప్రయోజనము లేదు కాబట్టి. ఈ ఉపాయాంతర త్యాగముతో కూడియున్నను వ్రజ అను పదములో చెప్పిన స్వీకారమాత్రము ప్రాప్యసమయమందలి స్వీకారమును తీసివేసి సిద్ధోపాయస్వీకారమును స్థాపింపజాలదు.

సిద్ధోపాయస్వీకారమునకు అంగముగా విధింపబడిన ఈ ఉపాయాంతరత్యాగము అంగియైన సిద్ధోపాయస్వీకారమును అర్థముగా కనపరచినను దానికన్న శాబ్దముగా చెప్పబడవలెననుటచేతను ఆవశ్యము శరణశబ్దప్రయోగముండవలయును.

౨౭. వ్రజ, అను పదమునకు.

౨౮. బుద్ధిచేయుము అని అర్థము.

౨౯. వ్రజ గతౌ అను ధాతువు గతిని చెప్పును, యే గత్యర్థాః, తే

ప్రాప్తి, అనిష్ట నివారణములను చేయునపుడు తనిపూర్వ, ఉత్తరస్థితులను తెలిసికొనుటకును అటువిమ్మట వీనికార్యమును చేయుటకును అవశ్యకమయిన సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వములనును చేతనునికి చేయు కార్యములను స్వకార్యముగా దలచి నెరవేర్చుట కుప యుక్తమైన శేషిత్వరూపసంబంధమునును, అవాప్తసమస్తకామత్వమను పూర్తి నిన్ని ప్రకాశింపజేయుచున్నది-

౬౬- మామ్ అనుపదమునందు నీకు సారథిని అయినిలిచియున్న నన్ను, ఉపాయముగా ఆశ్రయింపుమని స్వామి చెప్పినప్పుడు, అర్జునుడు తనరక్షణార్థమై స్వామిధరించిన సారథ్యవేషమును చూచి, సర్వస్వామి అయినవాడు ఇట్టినీచకృత్యమందునిలిచినది- ఆయనసౌశీల్యము చేతనని తలపక మనకునీచకృత్యమును చేయువాడు మనలనురక్షింపగలుగునా అని తనను పట్టి చూచి భయపడగా అట్టి భయము, తీరునట్లునిరంకుశస్వాతంత్ర్యరూపమైన పరత్వమును అహమ్ అనుపదముచేతనుప్రకాశింపజేయుచున్నాడు-

౬౭- ఇట్టి పరమస్వతంత్రుడను ఈశ్వరుడు అర్జునునికి సారథియైనిలిచిన ఈపారతంత్ర్యమున్ను తనయొక్క నిరంకుశ స్వాతంత్ర్యకార్యమే-

౬౮- త్వా అనుపదమునకు-

౬౯- నీకార్యమును తెలిసికొనుటకు తగినజ్ఞానములేనివాడవై తెలిసినను నెరవేర్చుకొనుటకు తగినశక్తిలేనివాడవై, శక్తికలిగి యుండినను నీయొక్క రక్షణమందు నీకుప్రాప్తిలేనివాడవై, అనగా సంబంధములేనివాడవై, యుండుటచేతను స్వతంత్రోపాయములయిన సర్వధర్మలను విడిచి నన్నేనిరపేక్షసాధనముగా పట్టియున్న నిన్ను అని అర్థము-

౭౦- సర్వపాపేభ్యః అనుపదమునకు-

౭౧- నాప్రాప్తికి ప్రతిబంధకములని అనగా, మోక్షప్రతిబంధకములని యేయేపాతకములనుజూచి భయపడుచున్నావో ఆయాపాపములన్నిటివల్లననుండి అని అర్థము-

ఈస్థలమందు భగవత్ప్రాప్తి విరోధులను మాత్రము చెప్పుటచే జ్ఞానవిరోధులును రుచివిరోధులును ఉపాయవిరోధులును పూర్వాధ్యాయములయందే తెలియ బడినట్లు స్పష్టమగుచున్నది-

పాపశబ్దము తొలగి బహువచనార్థము చెప్పబడుచున్నది-

౭౨. దేహాత్మాభిమానము వెదు, అసత్యజ్ఞానమున్ను సాంసారికప్రవృత్తిరూపమయిన దుష్టవ్యాపారమున్ను, రక్తమాంసాదిమయమైన మలినదేహమున్ను అని అర్థవాదుల తిరువిరుత్తమను ప్రబంధముయొక్క మొదటిపాశురమందు పాడిందిన ప్రకారముగా అవిద్యయు, కర్మయు, వాసనయు, రుచియు, ప్రకృతిసంబంధమును చెప్పబడుచున్నవి-

౧- అవిద్యయనునది, అజ్ఞాన, అన్యథాజ్ఞాన, విపరీతజ్ఞానములని మూడువిధములుగానుండును, అజ్ఞానమనగా, జ్ఞానము పుట్టకపోవుట, అనగా, దేహముకంటె వేరే ఆత్మయున్నాడను జ్ఞానము లేకపోవుట- అన్యథాజ్ఞానమనగా ధర్మియందు ధర్మాంతరప్రపత్తి, ఉదాహరణము- పీతశ్శంఖః- శంఖము పచ్చనిది అని శంఖమునకు స్వాభావికమైన తెలుపుగుణమును గ్రహింపక పచ్చనిదిగా గ్రహించుట- విపరీతజ్ఞానమనగా ధర్మియందు ధర్మ్యంతరప్రపత్తి, ఉ॥ ఇదం రజతమ్ అని శుక్తికనురజితముగా గ్రహించుటయు, రజితమును, గంగము అనగా తగరముగా గ్రహించుటయు-

౨- కర్మమనునది పుణ్యము పాపము అని రెండువిధములైయుండును, పుణ్యమున్ను పాపమువలెనే మోక్షప్రతిబంధకమగుటచేతను పాపశబ్దములో అంతర్భూతమగును కాబట్టి సర్వధర్మేభ్యో అనుస్థలమందు పుణ్యములున్ను పాపశబ్దముచేత చెప్పబడుచున్నవి-

౩- వాసన అనగా అబుద్ధిపూర్వకమయిన వ్యాపారమునకు హేతువు అయియుండునది ఇదియును అజ్ఞానవాసన, కర్మవాసన, ప్రకృతిసంబంధవాసన అని త్రివిధముగానుండును.

౪- రుచియనగా, బుద్ధిపూర్వకవ్యాపారమునకు హేతువు, అది

ము౦చునని, ఇదియును వితయభేదముచే బహువిధమైయుండును-

౫. ప్రకృతిసంబంధమనగా స్థూలసూక్ష్మరూపమైన దేహ సంబంధము-

ఆయాలోకములయందు, దేవమనుష్యాది రూపములుగా నుండి చేయు సుఖదుఃఖాద్యనుభవమునకు సాధనమైయుండునది స్థూలదేహము, దేహత్యాగానంతరమందు ఆయాలోకములనుండి లోకాంతరములకు వెళ్లుటకు సాధనమైయుండు శరీరము సూక్ష్మశరీరము-

౭౩- తృణచ్ఛేదకంమాయవాదులవలెనే అబుద్ధిపూర్వకముగా ప్రకృతిసంబంధవాసనచేతనుచేయు ఉత్తరాఘములను అనగా ప్రపత్త్యనంతరమందు ప్రామాదికముగాచేయు పుణ్యపాపములను, లోకులు నిందింతురను భయముచేతను వారలు చెడిపోదురనెడి కృపచేతను చేయు నిత్యనైమిత్తికాది కర్మములున్ను, మోక్షసాధనములు కావని ఇటువంటివానికి ఏవిధజ్ఞానాదులును మనః కాలుష్యము చేతను తిరుగా ఉపాయములుగా పరిగ్రహించుట గాని పునః ప్రవృత్తి చేయుట గాని ఈ మొదలగుసమస్తమును, సర్వశబ్దముచేత చెప్పబడును-

౭౪- ఉత్తమాధికారులు ఒకగ్రామమునకు వెళ్లనిచ్ఛలేకపోయినను ఒకమార్గమును వెంబడిపోయిన మాత్రముచేతను ఒకగ్రామమునకు చేరునట్లు సాధనబుద్ధిచేయక కేవలలోకాపవాదభీత్యాదులచేతను చేయుచున్న నిత్యనైమిత్తికాదికర్మములును, ఉపాయములలో చేరతగినవి కానట్టి కృపగలవారై ఆచరించినను ఆకాశముమీదికి ఎగరవేసిన రెడ్డమీదమంటిపోక క్రిందపడునప్రకారముగా ఈకర్మములును ఒక్కలమును కలుగకనివని చెప్పును. అందుచేతను ఇవియును పాపకర్మవ్యాప్యములును-

౭౫- ఒకఉపాయమే తప్ప రెండవఉపాయమునకు [illegible] ప్రపత్తిస్వభావమును తెలియక అజ్ఞానముచేతను [illegible] అనిష్టనివృత్తికిగాని ఇష్టప్రాప్తికిగాని సాధనముగా [illegible]

జ్ఞానాది ఉపాయాంతరములను స్వరూపతః విడవలేదు- వానియం దుండు ఉపాయత్వమునే విడచినాడు-

౯౫- స్వవర్ణ, స్వాశ్రమముల కుచితముగా చేతనుడు చేయు విహితకర్మ లందు ఉపాయబుద్ధి చేయక లోకమునందుండు కృపచేత జనులకొరకే చేయుటచేతను ఆకర్మము ఈశ్వరునికి మిక్కిలి ప్రియమై యుండును- అందువలననే ఈశ్వరప్రీతికొరకు చేయు కైంకర్యములో చేరును-

ఆత్మస్వరూపజ్ఞాన పూర్వకముగా పరమాత్మస్వరూపమును సాక్షాత్కరించుటకు ఉపయుక్తమైన జ్ఞానమందు ఉపాయబుద్ధి పోవుటతోనే ఇది స్వరూపజ్ఞానములో చేరును

భగవత్ప్రాప్తికి సాధనమైన భక్తియందు ఉపాయత్వము పోవుటతోనే భోజనమునకు పూర్వమందుండు ఆకలి వలెనే ఇది ప్రాప్యమైన కైంకర్యమునకు పూర్వక్షణమందుండు రుచిలో చేరును, సిద్ధోపాయవరణరూపమైన ప్రపత్తియందు ఉపాయత్వము పోవుటతోనే ఇది భగవదత్యంతపరతంత్రమైన ఆత్మస్వరూపము యొక్క యాథాత్మ్యజ్ఞానములో చేరును-

౯౬- భగవత్ప్రాప్తియనెడు ఒక్కఫలమునకు అనేక జన్మసహస్రములయందు సిద్ధించు కఠినమైన భక్త్యుపాయమునున్ను ఈజన్మమందే ఒక్కపర్యాయమే చేయతగినదై సులభమైన ప్రపత్త్యుపాయమునున్ను ఉపదేశించుటచేతను సాధనములయందుండు తారతమ్యమును చూడక వాటిని సమముగా చేసి ఫలమునిచ్చు సర్వేశ్వరుని యొక్క అనుగ్రహమే ప్రధానము కాబట్టి భక్తిప్రపత్తులు ఉపాయములు కావు ఈశ్వరానుగ్రహమే ఉపాయము-

౯౭. ఫలసిద్ధికి చేతనుడు చేయవలసినది ఈశ్వరుడు చేయు రక్షణమును స్వయత్నముచేత నిషేధింపకపోవుటయును వాడు ఇచ్చు ఫలము పురుషార్థమగునట్లు అర్థించుటయును ఇంతమాత్రము చాలును.

౯౮. కృత్స్నస్వరూపులయిన చక్రవర్తి తిరుమగనారు, సాపి

౧౦౨- చరమశ్లోకార్థప్రతిపాదకములగు వార్తైయఱి పవ
ర్ అనునమ్మాళ్వార్లు పాడిన పాశురమునున్ను, అఱ్ఱనాగి
యను తిరుమఙ్గైయాళ్వార్లు పాడిన పాశురమునున్ను ఇ
చ్చట అనుసంధించుకోవలయును-

వార్తైయఱిభవర్ మాయవర్కాళన్నియావరో పోర్త్తపిఱ
ప్పొడునోయొడు మూప్పొడిఱప్పివై। పేర్త్తుప్పెరుమ్ తున్బమ్ వేరఱ
నీక్కిత్తన్ తాళిన్ కీళ్ శేర్త్తు అవన్ శెయ్యుం శేమత్తై యెణ్ణిత్తె
ళివుత్తే-

ఈపాశురమునకు మామేకం శరణం వ్రజ అనువార్తను తెలిసి
కొనినవారు ఆత్మను ఆచ్ఛాదించుకొనియున్న జన్మములు, వ్యాధు
లు, ముసలితనము, మరణము మొదలగు వీటిని పోగొట్టి, దేహ
తపానమందు వచ్చు కైవల్యమనే మహాదుఃఖమును సవాసనగా
పోగొట్టి తనతిరువడిక్రిందను చేర్చుకొని పునరావృత్తిరహిత
ముగా సర్వేశ్వరుడు చేయురక్షణమును అనుసంధించి విశ్వాస
ముగలవారై తమకువిరోధినివర్తకుడై ఆశ్చర్యభూతుడైన వానికిఁ
గాక అన్యులకు దాసులగుదురా" అని అర్థము-

అఱ్ఱనాగి యాక్కైయాగి, యరూపుమేంబిరానుమాయ్, ఒత్తొ
వ్వాద పల్పిఱప్పొళిత్తు నమ్మై యాట్కొళ్వాన్ ముత్తనార్,
ముకుందనార్, పుగుందునమ్ముళ్ మేవినార్, ఎత్తినా లిడర్కడ
ల్ కిడత్తియేళైనెఞ్జమే ఈపాశురమునకు "హేయప్రతిభటుడైన
ట్టియు మోక్షస్థానమును ఇచ్చునట్టియు సర్వస్వామి, జ్ఞానా
కారముచేతను సమానములై దేవమనుష్యాద్యాకారముచేతను భి
న్నములైన ఆత్మలయొక్క నానావిధములయిన జన్మములను పోగొ
ట్టి, నిత్యసంసారులైన మనలను దాసులనుగా పరిగ్రహించు
టకై తండ్రి, తల్లి, స్వామి, మొదలగుసర్వవిధబంధువు లయి
తమపరత్వమునున్ను మననీచతనున్ను, చూడకమనలో ప్రవేశించి
పోకలేకుండా కలసియున్నారు- చపలమనస్సా ఏందుచేత దుఃఖ
సముద్రమందు పడియున్నావు "అని అర్థము-

## తిరుమన్త్రార్థము.

ఈ చరమశ్లోకమందు సర్వధర్మాన్ అను పదముచేతను ఉపాయస్వీకారమునకు అంగములగు త్యాజ్యధర్మములును, పరిత్యజ్య అను పదముచేతను ఆధర్మముల యొక్క త్యాగప్రకారమును, మామ్ అనుపదముచేతను త్యాగపూర్వకముగా ఆశ్రయింపబడు సౌలభ్యాదిగుణవిశిష్టవస్తువును, ఏకశబ్దముచేత అగుణవిశిష్టవస్తువు యొక్క సహాయాంతర నైరపేక్ష్యమును, శరణశబ్దముచేతను ఆవస్తువు యొక్క ఉపాయత్వమును, వ్రజ అనుపదము చేత ఉపాయస్వీకారమును, అహమ్ అనుపదముచేత క్రిందస్వీకరింపబడిన ఉపాయవస్తువు యొక్క జ్ఞానశక్త్యాదిగుణయోగమును, త్వా అనుపదముచేత ఆవస్తువునందు న్యస్తభరుడైన అధికారి యొక్క స్వరూపమును, సర్వపాపేభ్యః అనుపదముచేత ఆఅధికారికి విరోధియగు పాపసమూహమును మోక్షయిష్యామి అనుపదముచేతను, ఆపాపవిమోచనప్రకారమును, మాశుచః అనుపదము చేత పాపవిమోచకుడగు ఈశ్వరుని ఆశ్రయించిన అధికారి యొక్క నిర్భరత్వమును, చెప్పబడెను.

జీయర్ తిరువడిగళే శరణమ్.

---

తిరుమన్త్రార్థము సంపూర్ణము.



